# దాక్షిణాత్య భక్తులు

రావినూతల శ్రీరాములు

2002

1వ ముద్రణ 1982

2వ ముద్రణ 1984 మార్చి

3వ ముద్రణ 1985 అక్టోబర్

4వ ముద్రణ 2002 మార్చి

పేజీలు : 100

© రచయిత

**వెల రు.30/-**

ప్రతులకు

**ఆర్. శ్రీరాములు**

రమణస్థాన్

10/228 వసంతపురి కాలనీ,

మల్కాజిగిరి, హైదరాబాద్-500 047.

ఫోన్: 705 5437

డి.టి.పి & ముద్రణ:

**యం.వి.యస్.ప్రసాద్,**

**హైదరాబాద్ లేజర్ డిజైన్స్**

రాంనగర్,

హైదరాబాద్-48. ఫోన్: 98492 59027



**BHAGAWAN SRI RAMANA MAHARSHI**

---

అరుణాద్రి దరీవాసం కరుణామయవిగ్రహం
తరుణాదిత్య సంకాశం రమణంగురుమాశ్రయే

# ప్రాతః స్మరణీయులు

## జననీజనకులు



కీ॥శే॥ రావినూతల సత్యనారాయణ (1904-76)

కీ॥శే॥ రావినూతల అనసూయమ్మ (1915-98)

# గురుదేవులు



శ్రీ శ్యామ్ శ్రీ చరణ్ మహరాజ్

# విషయసూచిక

# త్యాగరాజ స్వామి



తెలుగు వారి ఇలవేలుపు శ్రీరామచంద్రమూర్తి. దండకారణ్య భాగమైన ఆంధ్ర దేశంలో శ్రీరాముడు పాదం మోపిన భద్రాద్రి పరమ పుణ్యక్షేత్రం.

రామ మందిరము లేని తెలుగు పల్లె కానీ, త్యాగరాజ కీర్తన లేకుండా సంగీత కచేరి కాని సాధారణంగా వుండవు.

సీతా రాములనే తన తల్లిదండ్రులుగా భావించి జీవితాంతం వారినే ఆరాధించి తరించిన ధన్యజీవి త్యాగరాజు. వీరి తండ్రి రామబ్రహ్మం చక్కని వేద పండితుడు. తల్లి సంగీతములో మంచి ప్రావీణ్యం కల భక్తురాలు. సంగీత సాహిత్యాలతో పాటు దైవ భక్తి వంశ పారంపర్యంగా త్యాగయ్యకు లభించింది.

కాకర్ల ఇంటి పేరు గల వీరి పూర్వుల నివాస స్థానం నేటి ప్రకాశం జిల్లాలోని కంభం ప్రాంతం. ఎన్నడో తంజావూరు ప్రాంతము వెళ్ళి స్థిరపడి పోయారు.

మాతృదేశం వదిలినా మాతృభాష వీడని మహానియుడు త్యాగయ్య. వాల్మీకి రామ కథను ఇరవై నాల్గువేల శ్లోకాలలో రచించాడు. త్యాగయ్య కూడా ఇరవై నాల్గువేల కృతులలో శ్రీరామ చంద్రుణ్ణి స్తుతించారట.

వైరాగ్యభావం జీవిత తొలిదశలోనే త్యాగయ్యకు కలిగింది. అన్నదమ్ముల వాటాలలో తన భాగానికి దేవతార్చనా సామాగ్రిని మాత్రమే కోరాడు.

అనుక్షణం రాముని సేవలోనే గడిపిన త్యాగరాజుకు బంధువుల నుండి అనేక ఇబ్బందులు ఎదురయ్యాయి. అతని పూజా విగ్రహాలను నదిలో పారవేశారు.

"హరినే నెందు వెదుకుదురా" అంటూ ఆర్తితో త్యాగరాజు స్వామి కీర్తన ఆలపించగా కావేరీ నదిలో విగ్రహాలు కొట్టుకొని వచ్చాయి.

మహాకవి పోతనవలెనే త్యాగరాజు కూడా తన కవిత్వాన్ని నరాంకితం చేయలేదు.

ఒకసారి సుందరేశ మొదలియార్ అనే శ్రీమంతుడు తనపై కీర్తనలు చెప్పమనగా త్యాగరాజు నిరాకరించాడు.

శరభోజి మహారాజు తన ఆస్థానకవిగా వుండమని కోరగా త్యాగరాజు అందుకు అంగీకరించలేదు.

"నిధికంటే రాముని సన్నిధియే సుఖమని" భావించిన విరాగి త్యాగయ్య.

నారదుడే ప్రత్యక్షమై "స్వరార్ణవమ"నే సంగీత శాస్త్ర గ్రంథాన్ని ఆయనకు బహుకరించారంటే త్యాగయ్య మహిమ ఎంతని చెప్పగలము.

రామతారక మంత్రాన్ని బాల్యంలోనే జపింప ప్రారంభించిన త్యాగయ్య తనకు ముప్పదిఎనిమిదేళ్ళు వచ్చేసరికి తొంభై అరుకోట్లు జపించారట. అప్పుడే శ్రీరామచంద్రుని సాక్షాత్కారం జరిగిందని ప్రతీతి.

'రామనామం' అనే అమృతాన్ని త్యాగయ్య ఇలా కీర్తించాడు. 'ఎంతనే వర్ణింతును శబరీ భాగ్యం - బెంతని వేదాంతులు వరకాంతులు జగమంత నిండియుండగ ఎంతనినే వర్ణింతును'.

"కనులార సేవించి - కమ్మని ఫలములనొసంగి తనువు పులకించి పాదయుగములకు మ్రొక్కి ఇనకుల పతి సముఖంబున పునరావృత్త రహితపదమును బొందిన త్యాగరా -జనుతురాలి పుణ్యంబును ఎంతనినే వర్ణింతును".

పీఠాధిపతి పిలుపున త్యాగయ్య కాంచీపురం దర్శించారు. తిరువత్తియూరు. కోవూరు నాగులాపురం, తిరుపతి, శ్రీరంగం నాగపట్టణం, ఘటికాచలం మున్నగు పుణ్యక్షేత్రాలన్నీ దర్శించి ఆయా దేవతలను తమ కీర్తనలతో స్తుతించారు.

"ఎందరో మహానుభావులు అందరికీ నావందనాలు" అని భక్త కోటికి అంజలిఘటించిన వినయశీలి త్యగరాజస్వామి.

తమ జీవిత చరమదశను స్పష్టంగా చెప్పగల్గిన జ్ఞాని త్యాగరాజు.

ఫలానరోజు అద్భుత మొకటి జరుగుతుందని శిష్యులకు తెలిపాడు.

"పరమాత్ముడు జీవాత్ముడు" అనే కీర్తన రచించి గానం చేస్తూ పరమాత్మలో విలీన మయినాడు.

1925లో తంజావూరు జిల్లా తిరువయ్యూరులో త్యాగరాజస్వామి సమాధి సమీపమున తన సర్వస్వం వెచ్చించి బెంగుళూరు నాగరత్నమ్మ ఆలయం నిర్మించింది.

దక్షిణదేశంలోని ప్రముఖ విద్వాంసులు ప్రతియేటా అక్కడ చేరి త్యాగరాజ స్వామి ఆరాధనలో పాల్గొంటారు.



# నారాయణ తీర్థులు



సంస్కృతములో రచించబడిన జయదేవుని అష్టపదులకు దీటైనవి నారాయణ తీర్థులవారి తరంగాలు.

సంగీత విద్వాంసులచే గొప్ప యక్షగానంగా శ్లాఘించబడినది. 'శ్రీకృష్ణ లీలా తరంగిణి'. దీని కర్త నారాయణ తీర్థులు. ఇతని జన్మ స్థలము గుంటూరు జిల్లాలోని 'కాజ', వీరి ఇంటి పేరు తల్లావజ్ఝలవారు. తీర్థులవారి పూర్వాశ్రమనామము గోవిందశాస్త్రి.

గోవింద శాస్త్రి తండ్రి నీలకంఠ శాస్త్రి. సంగీతములో ఇతనికిగల అపార పాండితిని బట్టి గాంధర్వ దేవుడని పిలువబడినాడు.

గోవింద శాస్త్రికి బాల్యములోనే వివాహమైనది. వీరి అత్తగారిది కృష్ణానది సమీపంలోని వేదాద్రి.

ఒక పర్యాయము గోవిందశాస్త్రి తమ అత్తవారి ఊరు వెళ్తున్నాడు. కృష్ణానది పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తున్నది. యువకుడగు శాస్త్రి సాహసించి నదిలో దిగాడు.

నదీ ప్రవాహము తీక్షణమై బ్రతుకుమీద ఆశలు వదులుకున్నాడు. అప్పటికప్పుడే మానసిక సన్యాసము స్వీకరించాడు. ఆశ్చర్యకరంగా వెంటనే అతనికి పట్టుచిక్కి నిరపాయంగా గట్టు చేరాడు.

అల్లుని సన్యాస స్వీకారంపట్ల అత్తమామలు మిక్కిలి దుఃఖించారు. తరువాత కొంతకాలానికి గోవిందశాస్త్రి కాశివెళ్లి ఉత్తరాదినగల పుణ్య తీర్థాలు సేవించాడు.

గోవిందశాస్త్రి ఆశ్రమ స్వీకారానంతరము నారాయణ తీర్థులైనారు.

సంస్కృతములో అనేక ఇతర గ్రంథాలు రచించినా తీర్థులు వారికి శాశ్వత కీర్తిని తెచ్చిపెట్టిన కృతి "కృష్ణ లీలా తరంగిణి".

భాగవత కథలు పన్నెండు అంకాలలో ఇది రచించబడినది కథముందుగా శ్లోకాలలో సూచించి తరువాత పాటలలో, గద్యలతో ఆ కథనే విపుల పరచారు తీర్థులు.

శ్రీ కృష్ణావతారంతో ప్రారంభమై అష్టమహిషీ కల్యాణముతో ముగుస్తుంది.

కీర్తన లన్నింటిలోనూ భక్తిరసము పరవళ్ళు త్రొక్కింది. ఆంధ్ర దేశంలోని పుణ్యక్షేత్రాలయిన వేదాద్రి, మంగళగిరి, అద్దంకి తిరుపతి మొదలగునవన్నీ తాను దర్శించిన సందర్భముగా తీర్థులవారు ఆయా దేవతలను తమ కీర్తనలతో స్తుతించారు.

తీర్థులవారి గురువు రామానందులు. తమ దేశాటనలో వీరు తీర్థులవారి వెంట ఉండినట్లు తెలుస్తున్నది.

తీర్థులవారి రచనలలో ఎడనెడా రామానందుల ప్రశంస కూడా కన్పిస్తుంది.

కాశీలో వుండగా తీర్థులవారు బిక్షాటన చేసి జీవించేవారు. ఏకాంతంగా తలుపులు బిగించుకొని తమ నివాసములో తరంగాలుగా పాడుకొనెడివారు. ఇరుగు పొరుగు వారలకు తీర్థుల గానముతోపాటు మృదంగ వాద్యాలు వినిపిస్తుండెడివి.

ఒక దినం అనుమానం వచ్చిన కొందరు ఒక చిన్న రంధ్రము ద్వారాలోనికి చూచూరట. శ్రీ కృష్ణభగవానుడు స్వయంగా నృత్యం చేస్తున్నట్లు వారికి కనబడింది.

అంతట శ్రీ తీర్థుల వారికి జరిగిన విషయం విన్నవించి క్షమించమని కోరినారట.

"మీరు ధన్యులు నాకు ఆ భాగ్యము కలుగలేదని" తీర్థులవారు తెలిపినారట.

తీర్థులవారి వెంటనున్న శిష్యులలో ఒకరిని పేదరికము మిక్కిలి బాధించ సాగినది.

తీర్థులవారు గమనించి వాని అరచేత ఒక ఆకు పెట్టి "తంజావూరు మహారాజు చేతిలో వ్రణమున్నది. అచ్చటకు వెళ్ళి ఈ ఆకును వారి చేతికి కట్టు. అది వెంటనే గుణమిస్తుంది. నీదారిద్ర్యం తీరుతుంది", అని చెప్పి పంపినారట.

తంజావూరు మహారాజు తీర్థులవారి గొప్పతనానికి ముగ్ధులై వారిని తన చెంతకు ఆహ్వానించారు.

తీర్థులవారి వెంటనున్న మేకను చూసి అది తిరుగు మేర భూమి వారికి దానమిచ్చిరి. అక్కడ గ్రామము ఏర్పడి దేవాలయాలు నిర్మింపబడి 'శీర్ణ మహాదేవి' పేరిట వెలసింది.

తీర్థులవారు తన అవసానకాలమును స్పష్టముగా మహారాజుకు శిష్యులకు తెలిపి జ్యోతి రూపమున "తిరుపందుర్తి" గ్రామములో దేహాన్ని విడిచి వెళ్ళారు. తంజావూరు పాలకుడైన అమరసింగు తీర్థుల ఆరాధనకై 19 ఎకరముల మాన్యము ఏర్పరచారు.

వృద్ధాప్యములో తీర్థుల వారిని కడుపునొప్పి బాధిస్తుంది. దక్షిణాదినగల వరహాపురక్షేత్రములో శ్రీవేంకటేశుని సేవించిన పిమ్మట బాధ తొలగుతుంది. స్వామిని కీర్తిస్తూ....

"జయ జయ వరాహపుర శ్రీ వేంకటేశ" అని వ్రాశారు. ఆ క్షేత్రములో తీర్థులవారి చిత్రపటము పూజలందుకొనడము వారు ఆరంభించిన "ఉట్ల పండుగ" బాద్రపద మాసములో ఈనాటికి కొనసాగడం మెచ్చదగినది.

అన్నమాచార్యులు ప్రారంభించిన ఆధ్యాత్మిక సంకీర్తనల పద్ధతిని శ్రీనారాయణ తీర్థుల తరంగాలతో ముందుకు తీసుకొని పోయారు.

కూచిపూడి సంప్రదాయానికి మూలపురుషుడైన సిద్ధేంద్ర యోగి నారాయణ తీర్థులకు సమకాలీనుడై ఆయన చెంత శాస్త్ర విషయాలు గ్రహించారని తెలుస్తుంది.

నారాయణ తీర్థుల తరంగాలు సామూహికంగా పాడబడుచూ భక్తులను తన్మయులను చేయుచున్నవి.

పూజానంతరము గానం చేయబడే క్రింది మంగళహారతి తరంగము ప్రసిద్ధమైనది.

**1) "మంగళం రుక్మిణీ రమణాయ శ్రీమతే**
**మంగళం రమణీయ మూర్తయేతే**
**మంగళం శ్రీవత్స భూషాయ శార్గిణే**
**మంగళం నంద గోపాత్మజాయ।**

**2) పూతనా కంసాది పుణ్యజన హారిణే**
**పురుహూత ముఖ దివ్యహిత కరాయ**
**సుతాయ విజయాస్య సుందర ముఖాబ్జాయ**
**శీత కిరణాదికుల భూషణాయ".**

--- *(శ్రీకృష్ణ లీలా తరంగిణి)*

ఈనాటికి తిరుపందుర్తిలో సిద్ధి పొందిన ఆంధ్ర మహాశయుని ఆరాధనోత్సవాలను నిర్వహిస్తున్న తమిళ సోదరులు ప్రశంసార్హులు।



# భద్రాచల రామదాసు



ఒక గృహస్థు బ్రాహ్మణ సంతర్పణ చేస్తున్నాడు. ప్రమాదవశాత్తు అతని చిన్నారి బిడ్డ వంటశాలలోని గంజి గుంటలోబడి మరణించాడు. అన్నదానం ఆగిపోతుందని భావించి చనిపోయిన పిల్లవాణ్ణి తన ఒడిలో వుంచుకొని సంతర్పణ ముగిసిన తరువాత ఆ విషయం భర్తకు ఎరుకపరుస్తుంది ఆ గృహిణి.

భార్యాభర్తలు దీనాతిదీనంగా శ్రీరాముణ్ణి ప్రార్థిస్తారు. దైవం కరుణించి ఆ బిడ్డను బ్రతికిస్తాడు. ఆ గృహస్థు ఎవరో కాదు భద్రాచల రామదాసుగా పేరుపొందిన కంచర్ల గోపన్న.

ఖమ్మం మెట్టు జిల్లాలోని నేలకొండపల్లె కంచర్ల గోపన్న జన్మస్థలం. తండ్రి లింగన్న మంత్రి, తల్లి కామాంబ.

చిన్నతనం నుండి బాలరామాయణం లాంటి పుస్తకాలు కంఠస్థం చేయడం వల్ల గోపన్నలోని భక్తి భావము జీర్ణించుకుపోయింది.

రఘునాధ భట్టరను మహనీయుడు ఈయనకు శ్రీవైష్ణవ దీక్షను యిచ్చాడు.

గృహస్థు అయినప్పటికి రామనామ స్మరణను గోపన్న విడువలేదు. నిరతాన్నదానాలతో, దైవ భక్తులతోనూ కాలక్షేపం చేసేవాడు. కాలక్రమేణా ఆస్తి పాస్తులు తరిగిపోయి నిరుపేదగా మిగిలాడు గోపన్న.

ఉద్యోగం కోసం గోల్కొండ నవాబు తానీషాను దర్శించాడు. అతని మంత్రులు అక్కన్న, మదన్న గోపన్నకు దగ్గర బంధువులు కావడంతో భద్రాచలం తాశిల్దారీ

ఉద్యోగం దొరికింది గోపన్నకు.

పావన గోదావరీ తీరాన వున్న శ్రీరామక్షేత్రం భద్రాచలం. ప్రాచీన కాలం నుండి అక్కడొక దేవాలయం వుంటూ వచ్చింది.

శ్రీరామచంద్రుడు వనవాసం చేసిన కాలంలో ఇక్కడి పర్ణశాలలోనే సీతాదేవిని రావణాసురుడు అపహరించుకు పోయాడు.

తాశీల్దారు అయిన గోపన్న తన ఇష్టదైవానికి నెలవైన భద్రాచలాన్ని కలియుగ వైకుంఠంగా మార్చాలని సంకల్పించాడు.

అనతి కాలంలోనే ఆరు లక్షల వరహాలు సేకరించాడు. భద్రాచల రామునకు దివ్యమందిరాన్ని, ఇరవై నాలుగు చిన్నగుళ్ళు, పెద్దగోపురం ప్రాకారాలు నిర్మించాడు. స్వామి నిత్యనైవేద్యాలకు చక్కని ఏర్పాట్లు కూడా చేశాడు.

యాత్రికులు తండోపతండాలుగా రాసాగారు. వారికోసం ఎన్నో వసతులు చేశాడు. కంచర్ల గోపన్న తన కల రూపుదాల్చినందులకు ఎంతో మురిసిపోయాడు.

ఎంతవారికీ జన్మాంతరకర్మలు అనుభవించక తప్పదు కదా!

ప్రభుత్వ ఖజానా ఖాళీచేసి రామదాసు భద్రాద్రిలో చేస్తున్న దైవకార్యాలు నైజాం నవాబుకు తెలిశాయి. తక్షణం తహశిల్దారును సంజాయిషీ అడిగాడు. సమాధానం, తృప్తిగా లేనందున గోపన్న జైలు పాలయ్యాడు. హరినామస్మరణతో కారాగారంలో రామదాసు కాలక్షేపం చేయసాగాడు. ఏండ్లూ పూండ్లూ జరిగినవి. బాధలు నానాటికీ హెచ్చయినవి.

దైవం కరుణించలేదని జీవితాన్ని ముగింపు చేద్దామనుకున్నాడు గోపన్న. ఇంతలో ఒక విచిత్రం జరిగినది. ఒకనాటి వేకువన రామదాసు సేవకులమంటూ ఇద్దరు భటులు ఆరు లక్షల వరహాలు తానీషా సన్నిధిలో కుమ్మరించి రశీదు పుచ్చుకున్నారు. వేగిరం బందిఖానాకువచ్చి రామదాసు చేతనుంచుకొన్న విషపాత్రను ఒలక పోశారు. రశీదు వానిముందు వుంచి అంతర్థానమయ్యారు.

ఇదంతా స్వామి కరుణ అని భావించాడు రామదాసు. తానీషా తక్షణం రామదాసును విడుదలచేశాడు. స్వయంగా ఆయనను బందిఖానాలో కలసి అతని భక్తిని మెచ్చుకున్నాడు. తానూ శ్రీరామభక్తుడై స్వామి వారికి అనేక అగ్రహారాలు సమర్పించుకున్నాడు.

తానీషా తనను విడుదల చేసినట్లు ప్రకటించగనే రామదాసు ఆనందంతో ఇలా గానం చేశాడు.

*అంతా రామమయం*
*ఈ జగమంతా రామ మయం*
*అంతరంగమున నాత్మారాము*
*డనంత రూపముల వింతలు సల్పగ*
*సోమ సూర్యులను సురులు తారలును*
*ఆ మహాంబుధులు నవనీ జంబులు*
*అండాండంబులు పిండాడంబులు*
*బ్రహ్మాండంబులు బ్రహ్మలు మొదలుగ*
*నదులు వనంబులు నానా మృగములు*
*విదిత కర్మములు వేద శాస్త్రములు*
*అంతా రామా మయం...*

చిరకాలం భద్రాద్రిరాముని సేవించి గోపన్న కాలక్రమాలన వైకుంఠం చేరుకున్నాడు.

భద్రాచల రామదాసు రచించిన వేలాది కీర్తనలు పండిత పామరులకు కంఠస్థమయినవి.

భక్తి భావ భరితమైన "దాశరధీశతకం" రామదాసు లేఖిని నుండి వెలువడిన అమృతభాండం.

రామదాసు నిశ్చల రామభక్తిని చాటే ఈ క్రింది పద్యం మిక్కిలి ప్రచారంలో వుంది.

*"చక్కెరమాని వేము దిన జాలిన కైవడి మానవాధముల్*
*పెక్కురు ఒక్క దైవముల వేమరు గొల్చెదరట్లు కాదయా*
*మ్రొక్కిన నీకు మ్రొక్కవలె మోక్షమొసంగిన నీవ యీవలెన్*
*దక్కిన మాటలేమిటికి? దాశరధీ కరుణా పయోనిధీ!*

వారి కీర్తనలలో ఈ క్రిందివి ప్రసిద్ధములు.

1) పలుకే బంగార మాయెనా! కోదండపాణి
2) ఎటుబోతివో రామా ఎటుబోతివో
3) రాముని వారము మాకేమి విచారము
4) రామనామమే జీవనము
5) అదిగో భద్రాద్రి గౌతమి ఇదిగో చూడండి
6) శ్రీకరముగ నిల రామదాసుని ప్రాకటముగ బ్రోచే.

త్యాగ రాజస్వామి కూడా భద్రాచల రామదాసును తన కీర్తనలలో శ్లాఘించారు.



# అన్నమయ్య



పదహారేళ్ళ బ్రాహ్మణ బాలుడొకడు తాళ్ళపాక పొలాల్లో గడ్డికోస్తున్నాడు. పరధ్యానం మూలాన చెయ్యితెగింది. రక్తం కారింది. సొమ్మసిల్లి పడిపోయాడు. ఏదో దివ్యదర్శనమైనట్లు తనకి తోచింది.

మెలకువ వచ్చేసరికి ఆ త్రోవలో తిరుపతి వెళ్తున్న భక్త బృందం పెట్టేకేకలు "గోవిందా" "గోవిందా" అని వినబడ్డాయి. బాలుడు తన మార్గం కూడా ఇదే కాబోలని వాళ్ళ వెంట వెళ్ళాడు.

తిరుపతి పరిసరాల్లో అడుగిడేసరికి అతనిలో కవిత్వం పెల్లుబికింది. తిరుమల శిఖరాలు కన్పిస్తూనే

"అదిగో అల్లదిగో హరివాసమూ
పదివేల శేషుల పడగల మయమూ".

అంటూ పదం వెలువడింది. తరువాతి కాలంలో పదకవితా పితా మహుడుగా విఖ్యాతుడైన అన్నమాచార్యుడే ఆ బాలుడు.

తిరుమల కొండ ఎక్కుతూ అలసిపోయిన అన్నమయ్య ఒంటరి వాడైపోతాడు. పెద్దముత్తైదువ వేషంలో అలమేలు మంగమ్మ అతనికి దర్శనమిస్తుంది.

సాలగ్రామ మయమైన తిరుమలలో చెప్పులు తొడగరాదని ఆమె హితవు చెప్పి సేదతీరుస్తుంది.

తిరుమలలో కూడా ఆయనకు స్వామి దర్శనం సులువుగా దొరకదు. ఆ వేళకు గర్భగుడిలో తలుపులు మూసివున్నాయి. స్వామిపై తాను రచించిన పద్యాలు పరవశుడై అన్నమయ్య పాడాడు. దివ్యతేజోస్సాకటి తటాలున మెరిసి మాయమౌతుంది. వెంటనే స్వామి గుడితలుపులు తెరువబడ్డాయి. అక్కడివారంతా అన్నమయ్యను అసాధారణ వ్యక్తిగా గుర్తిస్తారు.

కడప సమీపంలోని తాళ్ళపాక అన్నమయ్య జన్మ స్థలం. బుద్ధ భగవానుని జన్మదినమైన వైశాఖ పూర్ణిమ నాడే క్రీ.శ. 1408లో ఈయన జన్మించారు.

తండ్రి నారాయణ సూరి మహా పండితుడు. తల్లి అక్కమాంబ. గొప్పభక్తురాలు. శ్రీనివాసుని వర ప్రసాదంగా వీరికి జన్మించిన బిడ్డడే అన్నమయ్య. స్వామివారి నందకమే (ఖడ్గము) అన్నమయ్య అవతారమని పెద్దల విశ్వాసము.

నందవరీక బ్రాహ్మణుడైన అన్నమయ్య శఠగోపయతి చెంత దీక్షపొంది శ్రీవైష్ణవుడై అన్నమాచార్యులనే పేరిట ప్రఖ్యాతుడైనారు.

కొంతకాలం స్వామిని సేవిస్తూ తిరుమలలో వుండిపోయి అన్నమయ్య తల్లి తండ్రుల మాటమేరకు తాళ్ళపాక వచ్చి వివాహం చేసికొంటాడు.

ఆ దశలోనే రామాయణమంతా సంకీర్తనలతో రచనలు చేసినాడు. ఆయన భక్తి పాండిత్యాలను విని "టంగుటూరి" పాలకుడైన సాళువ నరసింహరాయడు అన్నమయ్యను మిక్కిలి గౌరవిస్తాడు.

అన్నమయ్య ఆశీస్సులతో సాళువ నరసింహరాయడు పెనుకొండకు ప్రభువౌతాడు. అన్నమయ్యను అక్కడికి ఆహ్వానించాడు.

ఒకనాడు స్వామిపై అన్నమయ్య చెప్పిన శృంగార కీర్తన విని ఆనందించిన నరసింహరాయలు తనపై కూడా అలాంటి పదం రచించమని కోరాడు.

**"నరహరి కీర్తన నానిన జిహ్వ**
**ఒరుల నుతింప నోపదు'.**

అని అన్నమయ్య బదులు పలుకుతాడు.

అధికార మదంతో రాజు అన్నమయ్యను సంకెళ్ళు వేయించి బంధిస్తాడు.

తన మహిమతో బంధ విముక్తుడైన అన్నమాచార్యుని తనను క్షమించమని రాజు ప్రాధేయపడతాడు.

అన్నమయ్యకు మడిమాన్యాలు ఇచ్చి గౌరవించాడు. అన్నమయ్యకు సర్వమూ శ్రీనివాసుడే.

ఈ క్రింది సంకీర్తనలో ఆ భావమే కన్పిస్తుంది.

**పాప పుణ్యముల పక్వమిదెరుగను**

**నా పాలిటి హరినమో! నమో!**

**మానవాచక మత కర్మంబులతాపకముగ నీ దాసు**

**డను పూని త్రిసంధ్యల భోగభాగ్యముల**

**నానాగతులను నమో! నమో!**

**వలనుగా జాగ్రత్స్వప్న సుషుప్తుల**

**ఇలలో నీకేహిత ఘటుడ**

**వెలుపలలోపల వేళావేళల**

**నళినాక్షి నీకె నమో! నమో!**

**పుట్టుక తొలితను పుట్టిన మీదట**

**అట్టి నీ శరణాగతుడ గట్టిన శ్రీ**

**వెంకటపతి! నీ కృప నట్టునడస్తుతినమో!**

పదహారవయేట స్వామిని సేవిస్తూ అన్నమయ్య ఆరంభించిన పదరచన (32,000) ముప్ఫై రెండు వేల సంకీర్తనలుగా సాగింది. నాలాయిరం (ద్రావిడ వేదం)లో నాల్గువేల పదాలు మాత్రమే వున్నాయి. అన్నమయ్య సంకీర్తనాలు ఆంధ్ర వేదాలుగా ప్రసిద్ధాలు.

కర్ణాటక సంగీత పితామహుడైన పురందరదాసు పద కవితా పితామహుడైన అన్నమాచార్యులు ఒకసారి కలిసికొంటారు. ఇరువురిలోనూ గల దైవాంశ పరస్పరం గుర్తించుకొని అభివాదాలు తెలుపుకుంటారు.

తమ సంకీర్తనలతో చిరకాలం స్వామిని సేవిస్తూ చివరకు సంకీర్తన గావిస్తూనే స్వామిలో లీనమైన కారణ జన్ముడు అన్నమాచార్యుడు.



# క్షేత్రయ్య



కొంచీ నగరంలో వరదరాజస్వామి మందిరంలో ఒకనాటి అర్ధరాత్రివరకు అర్చనలు జరిగాయి. చివరి సేవ ఏకాంత సేవ పేరిందేవి అమ్మవారికి, వరదరాజు స్వామికి శయ్యాసనాలు అమర్చి గుడి తలుపులు మూసి అర్చకులు వెడలిపోయారు.

తదేక ధ్యానంతో స్వామిని ధ్యానిస్తున్న మహాభక్తుడొకడు గర్భగుడిలోనే నిలచిపోవడం ఎవరూగమనించలేదు.

వేకువజామున ఒకానొక దివ్య స్త్రీ మూర్తి ఆ భక్తునికి గోచరమైనది. వెంటే అతని నోటి నుండి "మగువ తనకేళికా మందిరము వెడలెన్" పల్లవితో క్రింది పదం వెలువడింది.

విడజారు గొజ్జంగి - విరిదండ జడతోను
కడు చిక్కువడి సెనగు - కంఠ సరితోను
నిడరు కన్నులదేరు - నిదురమబ్బుతోను
తొడరి పదయుగమున - దడబడెడు దడతోను ॥మగువ॥

సొగసి సొగయని వలపు - సొంపు జూపులతోను
వగవగల ఘనసార - వాసనతోను
జగమించు కెమ్మోవి - చిగురు కెంపులతోను
సగము కుడముల విదియ - చందురలతోను॥ మగువ॥

**తరి తీపు సేయు సమ - సురతి బడలికతోను**

**జతరపావడ చెరుగు - జార్పైటతోను**

**ఇరుగడల గై దండ - అచ్చుతరునలతోను**

**పరమాత్మ మువ్వ గో - పాలు తెల్ల వారెననుచు** ॥మగువ॥

ఆ మహాభక్తుడే పదకవితా చక్రవర్తిగా పేరు గాంచిన క్షేత్రయ్య.

17వ శతాబ్దిలో జీవించిన క్షేత్రయ్య జన్మస్థలం కృష్ణా జిల్లాలో మొవ్వ. ఇతని పేరు వరదయ్య కాగా, అనేక క్షేత్రాలు దర్శించి ఆయా దేవతలను స్తుతించిన వాడైనందున క్షేత్రయ్యగా రూఢమైనది.

బాల్యంలో విద్యాగంధంలేని వరదయ్య పశువుల కాపరిగా వుండేవాడు. ఒక యోగి ఇతనికి గోపాల మంత్రం ఉపదేశించాడు. నాటినుండి వరదయ్యకు గొప్ప కవితా శక్తి అలవడింది.

మొవ్వ క్షేత్రంలో వెలసిన గోపాలస్వామి ఇతని ఇష్టదైవం కాగా రచనలన్నీ ఆ స్వామి పేరిట మువ్వ గోపాల అంకితాలైనవి.

భక్తుడు తనను నాయికగా భావించి భగవంతుని పొందుకోసము చెందే ఆరాటమే మధురభక్తి.

క్షేత్రయ్య పదాలన్నిటిలోను ఇలాంటి భక్తియే గోచరమౌతుంది.

**"శ్రీసుతుబారికి నను నే నోపలే నిను వేడితి**

**గోపాలా మువ్వ గోపాలా!**

**ఏ పొద్దు దానింటిలోను కాపై యుండి**

**నీ సరస సల్లాపాలా మువ్వ గోపాలా!**

పై పదం క్షేత్రయ్య చెప్పిన మొదటి పదం అని తెలుస్తుంది. ఆంధ్ర దేశంలోని తిరుపతి, కడప, శ్రీశైలం మున్నగు క్షేత్రాలలో నెలకొన్న దేవతలపైనే కాక కంచి, శ్రీరంగం, మధుర, తిరువళ్ళూరులలో వెలసిన స్వామి వార్లపై కూడా క్షేత్రయ్య పదాలు రచించారు.

కాని, అన్నిటిని మువ్వ గోపాలునికి అంకితం గావించి ఆ స్వామితో ఆయా దేవతలకు అబేధం కల్పించారు.

క్షేత్రయ్య భక్తి ప్రపత్తులనూ మధుర కవిత్వాన్ని గూర్చి విన్న ఆయా ప్రాంతాల ప్రభువులు ఇతనిని తమ తమ ప్రదేశాలకు ఆహ్వానించి సన్మానించారు.

మధురనేలిన తిరుమల నాయకుడు, గోలకొండ నవాబు, రఘునాథ నాయకుడు వీరిలో ప్రముఖులు.

తంజావూరు రఘునాథ నాయకునిపై క్షేత్రయ్య వేయి పదాలు చెప్పాడు. ప్రభువు సంప్రీతుడై కవిని ఘనంగా సత్కరించాడు.

పదకవితకు ఇంతటి పట్టం లభించడం ఇతర కవులకు మచ్చరం కలిగింది. రాజుతో వారు ఈ మాటనే చెప్పారు కూడా.

క్షేత్రయ్య ఒక చిట్కా వైద్యంతో మత్సర గ్రస్తుల వ్యాధిని కుదిర్చాడు. తానొక పదం వ్రాశాడు. అందులోని ఆఖరి చరణం మాత్రం మిగతా కవులకు వదలి పూరించమని చెప్పితాను సేతు యాత్రకని వెళ్ళిపోయాడు.

క్షేత్రయ్య తిరిగి వచ్చేసిరికి నిలయువిద్వాంసు లెవరూ అతని పదం పూర్తిచెయ్యలేక తమ అసమర్థతను ఒప్పుకున్నారు.

గోల్కొండలో కూడా క్షేత్రయ్య ఆస్థాన విద్వాంసుని గర్వం అణచి వేస్తాడు.

అనేక క్షేత్రాలు తిరిగి తిరిగి తన చరమ ఘడియ క్షేత్రయ్య ఎక్కడ అంతం చేసిందీ తెలియడం లేదు.

క్షేత్రయ్య పదాలలో లలితమైన తెలుగు తనంతో పాటు చక్కని అలంకారాలు, జాతీయాలు, కొల్లలుగా కన్పిస్తాయి.

సంగీతానికి, సాహిత్యానికి సరి అయిన ప్రాధాన్యము యిచ్చి పదకర్తగా ఆధునికులు క్షేత్రయ్యను మిక్కిలి ప్రశంసించారు.

క్షేత్రయ్య పదాలు నాట్యానికి అనుకూలంగా వుండటం విశేషం.



# తరిగొండ వేంకమాంబ

ఇరవై సంవత్సరాల వయస్సుగల ఒక భక్తురాలి భర్త కాలధర్మం చెందాడు. ఆచార ప్రకారం ఆమె జుత్తు తీయించాలి. కానీ ఆమె అందుకు ఒప్పుకోలేదు. తల్లిదండ్రులు బ్రతిమాలారు. ఊరివారు భయపెట్టారు. ససేమిరా ఆమె తన నిర్ణయం మార్చుకోలేదు. ఇలావుండగా కంచి పీఠాధిపతులు ఆ గ్రామానికి విచ్చేశారు. ఆమె తండ్రికి శ్రీముఖం పంపారు. తండ్రి కుమార్తెను తీసికొని వచ్చి స్వామి ఎదుట హాజరు పరిచారు.

బాల వితంతువుకు బలవంతంగా జుత్తు తీయించారు. మరుక్షణమే ఆమె ప్రక్కనే వున్న నృసింహస్వామి కోనేరులో మూడు మునకలు వేసింది. ఆమెకు యథా పూర్వకంగా వెంట్రుకలు వచ్చాయి.

అశేష జనం తమ తొందరపాటుకు తలలు వంచారు.

ఆ బాల వితంతు ఎవరనుకొన్నారు? మహా భక్తురాలనయిన తరిగొండ వేంకమాంబ. చిత్తూరు జిల్లా వాయల్పాడు గ్రామానికి నాలుగు మైళ్ల దూరంలో వున్న తరిగొండ, వెంకమ్మ గారి జన్మస్థలం. 1750 ప్రాంతంలో కానాల కృష్ణయ్య మంగమాంబ దంపతులకు వేంకమాంబ జన్మించింది.

ఆ గ్రామంలో వేంచేసివున్న నృసింహ స్వామి వారి ఇలవేల్పు.

ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా తల్లిదండ్రులు ఇంజేటి వెంకటా చలపతితో ఆమె వివాహం జరిపించారు. కానీ అనతి కాలంలోనే ఆతడు కాలధర్మం చెందాడు.

బాల్యం నుండి స్వగ్రామంలో నరసింహస్వామిని సేవిస్తూ వచ్చిన వేంకమాంబ కొంత కాలానికి తరిగొండ వదలి తిరుమల చేరింది. అక్కడ మొదట గోగర్భ తీర్థంలో తపో దీక్షకు పూనుకొన్నది. జనసంచారం అధికం కావడంతో అక్కడి నుండి పదిమైళ్ల దూరంలో వున్న తుంబురు తీర్థం చేరి అక్కడ గుహలో తపస్సు కొనసాగించింది. అక్కడికిన్నీ భక్తులు ఆమెను దర్శించడానికి విశేషంగా రాసాగారు. ఇక లాభం లేదని తలచి ఆమె తిరుమల చేరింది.

బిలమార్గం గుండా సూక్ష్మ శరీరంతో వెంకటేశ్వరుని గర్భగుడి చేరి రాత్రి వేళల కైంకర్యం చేసేదని భక్తులు భావించేవారు.

జానకీదాసు అను పూజారి ఒకనాటి రాత్రి రహస్యముగా గర్భాలయంలో దాగి ఆమె రాత్రి వేళల స్వామి కైంకర్యం చేస్తున్న మాట సత్యమే నని రూఢి చేసికున్నాడు. అప్పటి నుండి ప్రజలు ఆమెను మహాయోగినిగా గుర్తించారు.

శ్రీనివాసుని నృసింహమూర్తిగా సంభావించిన వేంకమాంబ నృసింహ జయంతి నాడు తిరుమలలో విశేషంగా అన్నదానం జరిపించేది.

1817లో ఆమె శరీరం చాలించేవరకు పూలు కోసి మాలలు కట్టి శ్రీవారికి సమర్పించేది. అందుకొరకు ఆమె మూడు తోటలను నెలకొల్పింది. ఒక తోటలో బావి కూడా త్రవ్వించింది.

ఆమె అర్చిస్తూ వచ్చిన చిన్న ఆంజనేయ విగ్రహాన్ని ఆమె సమాధి చెంత ప్రతిష్ఠించారు. అలాగే తరిగొండలోని నరసింహస్వామి ఆలయ ప్రాంగణంలో వెంకమాంబ మందిరం కూడా నిర్మితమైంది.

తిరుమలలో తాళ్లపాక వారి యింటి ప్రక్కనే వేంకమాంబ ఒక ఇల్లు సంపాదించింది. వయోభారం చేత ఏనాడైనా ఆమె స్వామిని దర్శించలేకపోతే స్వామి స్వయంగా విచ్చేసి ఆమె గృహాన్ని పావనం చేసేవారు. వేంకమాంబ నివేదించిన వంటకాలను స్వామి ప్రీతిగా స్వీకరించేవారని ప్రతీతి.

వేంకమాంబ స్వామిని జరిపిన ముత్యాల హారతి ఈ నాటికి ఏకాంత సేవలో భాగంగా ఆమె పేరిటనే నిర్వహించబడడం విశేషం.

శ్రీనివాసుని ఆంతరంగిక భక్తురాలైన తరిగొండ వేంకమాంబ మహాకవయిత్రిగా సాహిత్యంలోనూ విశిష్టస్థానం పొందింది.

ఈమె శ్రీ వెంకటాచల మహత్యం, మహాభారతం, రమాపరిణయం రాజయోగ సారం, విష్ణుపారిజాతం మున్నగు గ్రంధాలు రచించింది.

ఈమె కృతులన్నియు తరిగొండ నరసింహస్వామికే అంకితమిచ్చింది. శృంగారం పేరిట్న అసభ్య వర్ణనలు చేయకపోవుట ఈమె ప్రత్యేకత. తాను గురుముఖంగా విద్య నేర్వలేదని తన రచనలు పండితులు ప్రజలు పిల్లల పల్కులవలె ఆదరించమని వేడుకొన్నది.

సంస్కృతాంధ్రములలో అనేక కావ్యాలుండగా మరలా తాను ఎందుకు వ్రాసినదీ తెలుపుతూ భక్ష్యములు తిన్నవారు పచ్చడి నంజుకొన్న మాదిరి పేరాసతో వ్రాశానని తెలిపింది.

వేదాంతగ్రంథమైన రాజయోగసారాన్ని చక్కని ద్విపదలో సుబోధకంగా వ్రాయటంలో వేంకమాంబ ప్రతిభ కన్పిస్తుంది. దేవహూతి తన కుమారుడైన కపిలునే గురువుగా భావించి ఇలా అంటాడు.

"ఏ నొల్ల భాగ్యంబు, ఏ నొల్ల పదవి
నేనొల్ల సంసార మేనొల్ల నెల్ల
నీవేల దెలియకయే యిన్ని నాళ్లు
కాలంబు నూరకగడుపు చుంటి
*సకలలో కాతీత తత్త్వమికనైన నుపదేశ మీవయ్యదేవ*

వేంకమాంబ రచించిన శ్రీ కృష్ణ మంజరి స్త్రీలు పాడుకొనుటకు అనువైనదై బహుళ ప్రచారం పొందింది.



# తూము నరసింహదాసు

భద్రాద్రి రాముణ్ణి తన యిష్టదైవంగా జీవితాంతం సేవించి తరించిన మరి ఒక భక్త శిఖామణి తూము లక్ష్మీనరసింహదాసు.

భద్రాచల రామదాసే కర్మలేశం అనుభవించడానికి తూము నరసింహదాసుగా జన్మించారని కొందరి భావన.

తూమువారిది గుంటూరు మండలం. మన దాసుగారి తండ్రి అప్పయ్య. తాత వెంకటకృష్ణయ్యగార్లు శిష్టా చార పరులుగా ఆ ప్రాంతంలో ప్రసిద్ధులు.

1790లో అప్పయ్య, వెంకమాంబ పుణ్యదంపతుల మొదటి సంతానంగా నరసింహదాసు జన్మించారు. కాలక్రమేణా కృష్ణదాసను మరొక కుమారుడు. లక్ష్మీ బాయమ్మనే కుమార్తె కూడా వీరికి కలిగారు.

నరసింహదాసుగారికి ఇరవై ఏండ్లు నిండేసరికి తండ్రి గారయిన అప్పయ్య పరమపదించారు. కుటుంబ భారం పెద్దకుమారుడైన దాసుగారిపై బడింది. జీవిక కోసం పొన్నూరులో పేష్కారుగా పనిచేశారు నరసింహదాసు.

వంశాను గతంగా నరసింహదాసుకు లభించిన తరగని పెన్నిధి రామభక్తియే! కొంతకాలానికి భగవత్ సేవకు ఆటంకం కల్గిస్తున్న ఉద్యోగానికి దాసు తిలోదకాలిచ్చారు.

తమ యింటిలోనే రామ మందిరం నిర్మించారు. సమర్థులైన గురువు చెంత తారకమంత్రం ఉపదేశం పొందారు నరసింహదాసు.

భక్తి భావ భరితమైన గీతములు. పద్యములు దేవదేవునిపై రచించి పాడు కుంటూ అతిథి అభ్యాగతులను సేవిస్తూ ఆయన కాలక్షేపం చేస్తూ వుండేవారు.

శరీరపటుత్వం ఉన్నప్పుడే తీర్థ యాత్రలు సులువుగా నెరవేరుతవి. నరసింహ దాసు దేశం ఎల్లెడలా సంచరించి తాము దర్శించిన దేవతలను పద్య కుసుమాలతో పూజించారు.

1818-19లో శ్రీరంగంలోని రంగనాధుని దర్శించి

"చంద్ర సూర్యద్యుతుల మించు శంఖ చక్ర
ముఖుర దివ్యాయు ధోత్కరములు కరముల
దనరగాఁగంటి నిటువంటి ఘనతరారురాంగు
నంగ దూరుని శ్రీరంగశాయి గంటి"

అని పద్యం చెప్పి ధన్యులైనారు.

రైలుమార్గంలేని కాలంలో కాలినడకన శ్రమకోర్చి 1820-21లో కొందరి మిత్రులతో నరసింహదాసు కాశీయాత్రకు ప్రయాణం కట్టారు.

ముందుగా అమరావతిచేరి కృష్ణాస్నానం చేసి అమరేశ్వరుణ్ణి సేవించి ముందుకుసాగారు. కొలది దినాలకే భక్త బృందం భద్రాద్రి చేరారు. తన ఇష్టదైవం శ్రీరామచంద్రమూర్తి దివ్య మంగళ విగ్రహాలను దర్శించి నరసింహదాసు పులకిత గాత్రుడైనారు. బహుపరాకులు పలుకుతూ క్రింది పద్యకుసుమాలని సమర్పించుకున్నారు.

**"వారిజాక్ష రమాధీశ! బహుపరాకు**

**భక్త నరసింహ పోషక బహూపరాకు**

**భద్రశైలో పరిస్థిత బహుపరాకు**

**భక్త మందార రఘువీర బహుపరాకు".**

మార్గ మధ్యంలో పూరీలో వేంచేసియున్న శ్రీ జగన్నాథ స్వామిని దర్శించిన దాసు పంచ చామరంతో స్వామిని స్తుతించారు.

శ్రీ నరసింహదాసు జాజిపురంలో విడిదిచేసే సమయంలో కాశీదర్శనం తనకు ప్రాప్తమగుతుందోకాదో అనిచింతింపసాగారు.

స్వప్నంలో ఇష్టదైవం శ్రీరామచంద్రమూర్తి కన్పించి వెన్నుచరిచి అభయమిచ్చాడు. దాసుకు కొండంత ధైర్యం వచ్చింది.

ప్రయాణం పట్టుదలతో సాగించారు దాసు. గయ, ప్రయాగ క్షేత్రాలు సేవించుకుంటూ కాశీ చేరుకున్న నరసింహదాసు క్రింది పద్యంలో తన ఆనందాన్ని తెలుపుకున్నాడు.

**"పాంచ భౌతిక దేహంబు బాసి జీవుఁ**

**డరుగునపుడు సవ్య కర్ణాంతరమునఁ**

**దారక బ్రహ్మ మంత్రంబు దయనొసంగు**

**హరుని కాపుర మగు కాశి నరయగంటి".**

కాశిలో కొన్ని దినాలు వుండి తృప్తి దీర విశ్వనాధుని, అన్నపూర్ణను సేవించుకొని మార్గమున గల పుణ్యక్షేత్రాలు దర్శిస్తూ నరసింహదాసు గుంటూరు చేరుకున్నారు.

యాత్ర చేయడానికి వలసిన డబ్బు ఏమిచేతులో లేక పోయినా నరసింహదాసు దక్షిణదేశ క్షేత్రాలు దర్శించడానికి బయలు దేరారు.

1822లో గుంటూరులో బయలు దేరి మార్గమధ్యంలో పొన్నూరు. బాపట్ల, నెల్లూరు, చెన్నపురి, కుంభకోణం మున్నగు ప్రదేశాలు దర్శిస్తూ తిరువయ్యూరు చేరారు.

మహాభక్తుడైన త్యాగరాజస్వామి వీరిని ఎదుర్కొని కీర్తనలు గానం చేస్తూ స్వాగతం చెప్పారు.

తన్మయుడై దాసు నృత్యం చేస్తూ త్యాగరాజస్వామి మందిరంలోకి ప్రవేశించారు. త్యాగరాజస్వామి మహిమను దాసు ఇలా వర్ణించారు.

**"రామ పద భక్తికీ త్యాగరాయ వరుని**
**సమముగా నేరనెవ్వరీక్ష్మాతలము న(**
**ప్రేమ నాఘనుడొకసారి పిలిచెనేని**
**రాముడొహోయటంచు మార్పలుకునంట".**

కాశీనుండి తాను తెచ్చిన గంగా జలంతో నరసింహదాసు రామేశ్వరంలో ఈశ్వరునికి అభిషేకం చేశారు.

కాంచీపురంలో వరదరాజస్వామి దర్శనం కోసం వెళ్ళిన నరసింహదాసును అక్కడివారలు ఒక్కింతసేపు ఆటంక పరుస్తారు. దాసు తన ఇష్టదైవాన్ని ధ్యానించుకోగా వైష్ణవస్వామి ఒకరు దాసును తోడ్కొనిపోయి దైవదర్శనం చేయిస్తారు.

మరి ఒకసారి శ్రీ వేంకటేశ్వరుని దర్శించే నిమిత్తం నరసింహదాసు తిరుపతి వెళ్ళారు. కంచిలో కన్పించిన వైష్ణవస్వామి కన్పించి "నీ తాత తండ్రులు మ్రొక్కుబడులు తీర్చి కానీ కొండ ఎక్కవద్ద"ని హెచ్చరించి అదృశ్యుడైనాడు.

నరసింహదాసు తన దారిద్ర్యాన్ని తలపోస్తూ స్వామిని నిష్ఠు రోక్తులతో నిందిస్తారు.

ఆనాటి రాత్రి శ్రీవేంకటేశ్వరుడు దాసునకు కలలో కన్పించి కొండపై గల తీర్థాలన్నిటినీ స్వయంగా దగ్గర వుండి చూపాడు.

1826-28లో నరసింహదాసు తిరిగి ఉత్తర దేశ యాత్రలకు పయనం సాగించారు.

అయోధ్యలో కొంతకాలం నిలిచి శ్రీరామచంద్రమూర్తి పాదస్పర్శచే పునీతమైన ప్రదేశాలని తనివితీర దర్శించారు. హరి ద్వారం బదరీలుకూడా సేవించుకొని తిరిగి గుంటూరు చేరుకున్నారు.

తిరిగి మరు సంవత్సరమే (1829)లో దాసుగారి మనసు దక్షిణదేశ యాత్రలపై లగ్నమయింది.

చెన్నపట్నంలో నాగండ్ల వరదరామదాసనే సంపన్నులు నరసింహదాసుకు పాదాక్రాంతా లయినారు. దాసుగారు నాగండ్లవారికి తారక మంత్రోపదేశం చేశారు.

గుర్రు దక్షిణగా వరదరామదాసు శ్రీనరసింహదాసుకు నాలుగు వేల రూపాయలు సమర్పించారు.

గుంటూరు చేరిన వెంటనే నరసింహదాసు తమ తాత తండ్రులు చేసిన బాకీలన్నీ శిష్యుడు యిచ్చిన దక్షిణతో తీర్చి వేశారు.

భక్తి మార్గంలో పరిపక్వదశకు చేరుకున్న నరసింహదాసు కుటుంబంతో తన యిష్టదైవానికి నెలవైన భద్రగిరి చేరారు.

ఆ సంవత్సరమే (1830-31) వారి శిష్యులైన వరద రామదాసు గురువు సన్నిధికే కుటుంబ సమేతంగా తరలివస్తారు.

శ్రీరామచంద్రమూర్తికి రంగరంగ వైభోగాలతో జరుగవలసిన పూజాదికాలు కుంటుపడడం నరసింహదాసు హృదయానికి తీరని బాధకలిగించాయి.

స్వామి ఒకనాటి రాత్రి కలలో కన్పించి హైద్రాబాద్‌లో మంత్రిగావున్న చందూ లాల్ అనే తన భక్తుని దర్శించమని దాసుగారిని ఆజ్ఞాపిస్తాడు.

"నీ చెంతకు వచ్చిన భక్తుని తగినరీతి సన్మానించమని" స్వామియే చందులాల్ కున్నూ స్వప్నంలో హెచ్చరిక చేశాడు.

మహాభక్తుడైన నరసింహదాసు మహామంత్రియైన చందూలాల్ సమాగమం ఆస్తికులకు పరమానందం కలిగించింది.

భద్రాద్రి, పాల్వంచ పరగణాలకు పాలకునిగా శ్రీనరసింహ దాసును నియమిస్తూ చందూలాల్ సకలరాజలాంఛనాలను ఆయనకు అందజేశారు. నాటి నుండి భక్త నరసింహదాసు రాజా నరసింహ దాసుగా ప్రసిద్ధివహించారు.

సత్పురుషుల చేతి సంపద సద్వినియోగం కావడం సహజమే కదా!

భక్త నరసింహదాసు, వరదరామదాసు గారలు తమ ఐశ్వర్యాన్ని భద్రాద్రి రాముని కైంకర్యానికే వినియోగించారు.

ఆ దినాలలో భద్రాచలం తిరిగి కలియుగ వైకుంఠంతో తులదూగింది. నారద తుంబురులే నరసింహ వరదరామదాసులుగా దివినుండి భువికి దిగివచ్చిన నారని నాటిభక్తకోటి భ్రమపడింది.

ఈ మాదిరి కొంతకాలం సాగింది. ఒక సంవత్సరం కరువు రక్కసి విలయ తాండవం చేసింది. కానీ, నరసింహదాసు ధాన్యపు గిడ్డంగులను తెరిపించి నిరతాన్న దానం చేసి అన్నార్తులను ఆదుకున్నారు.

కర్మబద్ధుడైన వరద రామదాసుకు క్షయ వ్యాధి అంకురించి స్వల్పకాలంలోనే ఆయనను క్రుంగతీసింది. నిరంతరం రామనామ స్మరణ చేసుకుంటూ వుండిన దాసు విజయ సంవత్సరం (1833-34) భాద్రపద చతుర్థినాడు భద్రాద్రి రామునిలో లీనమయినాడు.

వరదరామదాసు భౌతిక కాయాన్ని నిమజ్జనం చేయడానికి ఒక పడవలో

గోదావరి నది మీద భక్త బృందం తరలి వెళ్ళింది.

అందులో నరసింహదాసు నాయకత్వాన 17 మంది భక్తులు ఎలుగెత్తి నిర్విరామంగా సంకీర్తనం చేస్తున్నారు.

**"పోయెదమయ్యా! వైకుంఠమునకు పోవుచున్నాము.**

**శ్రీయఃపతిని దలంచి భక్త శ్రేణులకు దండములు పెట్టి**

**"పోయెదమయ్యా"**

ఇంతలో నరసింహదాసు భద్రాద్రి గోపురం పై గల చక్రం వైపు చూచి నమస్కరించారు. అంగీకారం సూచిస్తున్నట్లు చక్రం గిరగిరా తిరుగసాగింది.

అంతే! తక్షణం నరసింహదాసు గోదావరి పావన తరంగాలలో తన భౌతిక దేహాన్ని వదలివేశారు.

పడవలో నున్న 17 మంది శిష్యులు తమ గురుదేవుని అనుసరిస్తూ దేహత్యాగం చేశారు.

గోదావరి ఒడ్డున చేరి ఈ దృశ్యాన్ని తిలకిస్తున్న వేలాది జనావళికి పాండవుల మహాప్రస్థానం స్ఫురించింది.

మృతకళేబరాలకోసం వెదకగా వరదరామదాసు, నరసింహదాసుల శరీరాలు తప్ప మిగిలిన వారివి మాత్రమే లభ్యమయినాయి.

అశేషజనం ఆశ్చర్యంతో చూస్తుండగా ఆ సమయంలో దివ్య తేజస్సు ఒకటి వినీలాకాశంలో వింతకాంతు లీనింది.



# పురందర దాసు



పండరీపురంలో విఠలదేవుని భక్తురాలైన ఒక దేవదాసి వుంటూ వచ్చింది. ఆమె అద్భుతంగా పాడేది. అంతకంటే మించి నృత్యం చేసేది.

ఒకనాడు పురందర దాసనే మహాభక్తుడు ఆమె యింటికి విచ్చేశాడు. దేవదాసి ఆడిపాడి కనులవిందు చేసింది.

ముగ్ధుడైన దాసు ఆమెకు అమూల్యకంఠాభరణం ఒకటి బహూకరించాడు. చిత్రంగా మరునాడు విఠలస్వామి విగ్రహాన్ని అలంకరించే ఆభరణం మాయమైంది. అది దొంగిలించి దేవదాసికి అందజేసిన పురందర దాసు పట్టుబట్టాడు.

ఆలయ ప్రాంగణంలోని స్తంభానికి కట్టి వేసి పురందర దాసును చావ మోదారు.

ఇంతలో గర్భగుడి నుండి అశరీరవాణి వినబడింది. పురందరదాసు వేషంలో ఆ ఆభరణాన్ని తామే దేవదాసికి బహూకరించామని విఠలదేవుడు వాక్కుయిచ్చాడు. అంతేకాదు, పూర్వజన్మ కర్మల నుండి పురందర దాసు విముక్తుడైనాడని విఠలదేవుని వాక్కువినబడింది.

నాటినుండి పురందర దాసు శిక్షింపబడిన స్తంభం కూడా పూజార్హత సంతరించుకుంది.

ఈనాటికీ పండరీపురంలో ముందు దాసర స్తంభాన్ని పూజించిన పిమ్మటే భక్తులు విఠలుని పూజిస్తారు.

క్రీ.శ. 1484లో పూనా సమీపాన గల గ్రామంలో పురందర దాసు జన్మించాడు.

తండ్రి వరదప్పనాయక్ ఆ ప్రాంతంలో ప్రముఖ వడ్డీ వ్యాపారి. పురందరుని

మొదటి పేరు శ్రీనివాసులు, తల్లిదండ్రులు వేంకటేశ్వరస్వామి భక్తులు.

ఆ స్వామి వరప్రసాదంగా భావించి తమ బిడ్డకు ఆయన పేరు పెట్టారు.

బాల్యంలో సంస్కృతం, కన్నడం చదువుకొన్న శ్రీనివాసునకు తగిన వయస్సులో అందాలరాశి సరస్వతీ బాయి నిచ్చి పెండ్లి చేశారు.

తండ్రి చనిపోయిన తరువాత శ్రీనివాసు ఆయన అడుగు జాడలలో వ్యాపారం చేస్తూ లక్షలకు లక్షలు గడించారు. నవకోటి నారాయణుడుగా గణనకెక్కాడు.

ఆ దశలో అతడు మిక్కిలి పిసినిగొట్టు. సరస్వతీబాయి దొడ్డ యిల్లాలు. ఆమెకు దైవభక్తి ఎక్కువ.

ఒకమారు తన కుమారుణ్ణి వెంటబెట్టుకొని ముసలి బ్రాహ్మణుడొకడు శ్రీనివాసుని వద్దకు వచ్చాడు. శ్రీనివాసు వ్యాపారంలో మునిగి వున్నాడు. తన బిడ్డకు ఉపనయనం చేస్తున్నానీ ఏదైనా సాయం చేయమని బ్రాహ్మణుడు శ్రీనివాసుని కోరాడు.

"రేపురా మాపురా" అని అనేక దినాలు ఆ బ్రాహ్మణ్ణి తిప్పి కడకు చెల్లని కాసొకటి అతనికి యిచ్చాడు శ్రీనివాసు.

ఆ బ్రాహ్మణుడు సరాసరి శ్రీనివాసుని ఇంటికి వెళ్ళాడు. సరస్వతీ బాయి పెరటిలో తులసిపూజ చేసుకుంటున్నది.

తన కుమారుణ్ణి చూపి వీనికి వడుగు చేయాలీ ఏదైనా సాయం చేయమన్నాడు. నా వద్ద ఏమున్నది స్వామి! అన్నది ఆ మహాయిల్లాలు.

అలా అంటావేమిటమ్మా! నీముక్కెర నీపుట్టింటి వారిచ్చిందే గదా! అన్నాడు బ్రాహ్మణుడు. వెంటనే కృష్ణార్పణం అంటూ బ్రాహ్మణుని చేతిలో ముక్కెర వుంచింది సరస్వతీ బాయి.

మిక్కిలి విలువైన ఆ ముక్కెర చేత బుచ్చుకొని బ్రాహ్మణుడు సరాసరి శ్రీనివాసు అంగడికి వచ్చి దీన్ని వెలకట్టి పైకం యిమ్మన్నాడు.

శ్రీనివాసుడు తక్షణం పరికించాడు. ఆ ఆభరణం తన భార్యదని ఇట్టే గుర్తించాడు. దానిని జాగ్రత్తగా భద్రం చేశాడు. కొంచెం నిదానించమని బ్రాహ్మణ్ణి కోరాడు.

పరుగు పరుగున ఇంటికి వెళ్ళి సరస్వతీ! నీ ముక్కెర ఏదీ అని గద్దించాడు శ్రీనివాసుడు.

"ఇంటిలో దాచానండీ" అని బొంకింది సరస్వతీ బాయి. వేగిరం తెచ్చి ఇవ్వమన్నాడు భర్త. పెనమిటి చండశాసనుడని సరస్వతికి బాగా తెలుసు. అతని చేతిలో చావు మూడిందని గ్రహించి లోనికి వెళ్ళింది.

ఒక గిన్నెలో విషం కలుపుకుంది. ఇష్టదైవాన్ని మనసారా ప్రార్థించింది. ఇంతలో గిన్నెలో ఏదోపడిన శబ్దం అయింది. ఆశ్చర్యం! తన ముక్కెర అందులో కనిపించింది. చివాలున వసారాలోకి గెంతింది. భర్త చేతిలో ముక్కెర ఉంచింది. ఇప్పుడు ఆశ్చర్య పోవడం శ్రీనివాసుని వంతు. జరిగినదంతా భార్య ద్వారా తెలుసుకున్నాడు.

వచ్చిన ముసలి బ్రాహ్మణుడు మరెవ్వరో కాదు. తనకు జ్ఞానము కల్గించడానికి వచ్చిన పరమేశ్వరుడని గ్రహించడానికి శ్రీనివాసుకు ఎంతో సేపు పట్టలేదు.

తన సర్వస్వం బీద సాదలకు పంచి వేశాడు. విరాగియై కట్టు బట్టలతో విద్యానగరం చేరాడు. వ్యాసరాయలను ఆశ్రయించాడు.

నాటి నుండి శ్రీనివాసులు పురందరదాసు అయి దేశం అంతటా హరినామ సంకీర్తనం చేస్తూ తిరిగాడు. ఆయన కీర్తనలు నాలుగు లక్షలకు మించిన వని ప్రతీతి. ఈనాడు వాటిలో ఎనిమిది వేలు మాత్రం లభ్యమౌతున్నాయి.

సాధారణ భక్తి భావం మొదలుకొని కీలకమైన తత్త్వబోధ అయన గీతాల్లో కన్పిస్తాయి.

బాలకృష్ణుని దివ్య మోహన నృత్య విలాస వర్ణన ఈ కీర్తనలో చూడవచ్చు.

**హరి కుణి దనమ్మ హరి కుణిద**
**అకళంక చరిత మకర కుండల ధర**
**సకల పాలిస హరి కుణిద**
**అరశెలె మాగాయి ఒళముత్తి ననర!**
**సకలర పాలిస హరి కుణిద**
**ఉట్టు పట్టు దట్టి ఇట్ట కాంచిధామ**
**దిట్ట మల్లర గంద హరి కుణిద**
**పరమ భాగవతర పుర దోళాదువ**
**పురందర విఠల! హరికుణిద!**

పురందరదాసు ఎనభై ఏళ్ళు జీవించి క్రీ.శ. 1564లో కాలధర్మం చెందాడు.

పుట్టుకచే మహారాష్ట్రుడైనా కన్నడ భాషలో రచనలు చేసి కన్నడ దేశంలోనే అధిక భాగం గడిపి కర్ణాటకుల ప్రీతి పాత్రుడైనాడు.

తన దివ్య గానామృతంతో మానవులను తరింప జేసిన పుణ్య పురుషుడు పురందర దాసు.



# విజయదాసు



కర్ణాటక రాష్ట్రంలో రాయచూరు సమీపంలోని "కల్లూరు"లో సుబ్బనా చార్యుడు గొప్ప పండితుడు. ఆయన సుధా పండితులుగా ప్రసిద్ధులు. కాని దాసకూట మంటే ఆయనకు ఏవగింపు.

ఒకసారి కల్లూరులో సుధా మంగళ నిర్వహిస్తున్నారు. సుబ్బనాచార్యులు, విజయదాసనే మహాభక్తుడు విచ్చేసి పండితుణ్ణి దర్శించాడు.

"నీవేనా కుశి కుమారుడవు దాసూ" అన్నారు. "చిత్తం తమరొక సుధా వ్యాకం ఉపదేశిస్తే ధన్యుడనౌతాను" అన్నాడు దాసు.

"నీకా.......................సుధా వాక్యమా!

న్యాయ సుధ అంటే ఏమనుకున్నావు?"

ఇంకేమైనా పవిత్ర గ్రంథాలు చదివావా!" అన్నారు ఆచార్యుల వారు.

"నేను కేవలం హరిదాసును స్వామి! అంత గొప్ప గ్రంథాలు పఠించడం నాకెలా సాధ్యం! అన్నాడు విజయదాసు.

"సుధా వాక్యం అంటే కన్నడ గీతం అనుకుంటివా!" అన్నారు ఆచార్యులవారు.

"నేను వివాదంలోకి దిగలేను స్వామీ మీరొక వాక్యం అనుగ్రహిస్తే మననం చేసుకుందామని వచ్చాను. అని విజయదాసు వినయంగా మనవి చేసాడు.

"నీ గురువు ఎవరు? ఇప్పటి వరకూ ఏ ఏ గ్రంథాలు చదివావని తిరిగి పండితులు ప్రశ్నించారు.

"అయ్యా ఆగ్రహించకండి! నేనే గ్రంథాలను చదవలేదు.

నాకు ఇరువురు గురువులు ఒకరు దాసు (పురందరదాసు) మరొకరు వ్యాస (వ్యాసరాయలు) వారి అనుజ్ఞమేరకే నేను హరిదాసు నయ్యాను" అని జవాబు చెప్పాడు విజయదాసు.

ఏమేమీ వ్యాసుణ్ణి కూడా నటవిట గాయకుల్లో చేర్చావా!" అన్నాడు పండితుడు.

"సందేహం ఏముంది? స్వామి! శ్రీకృష్ణభగవానుడొక నటుడు. మధ్వాచార్యులు, టీకాచార్యులు, శ్రీపాదరాజు, రాఘవేంద్ర స్వామి అందరూ నటులే అన్నారు దాసు. "నారాయణ" "నారాయణ" అంటూ చెవులు మూసుకున్నారు సుబ్బనాచార్యులు.

"అందరినీ దాసకూటమిలో చేర్చావు నీకు సుధా వాక్యం అర్థం అవుతుందనుకోను" అన్నాడు పండితులు. చిత్తం గురువులకు అర్థం అయితే శిష్యుడికి తప్పక అర్థమౌతుందన్నాడు "విజయదాసు".

"ఏమి! నీ అహంకారము" హుంకరించారు సుబ్బనాచార్యులు.

"అహంకారం కాదు స్వామీ! శాస్త్రాలు ఆ మాదిరి సెలవిస్తున్నవి" అన్నాడు విజయదాసు.

ఇంతలో ఆ వైపు నీళ్ళు మోస్తున్న బ్రాహ్మణ్ణి పిలిచాడు విజయదాసు.

వాని నెత్తిన అక్షింతలు చల్లాడు.

సుధా గ్రంథంలోని టీకా కర్తలకు కూడా అందని కఠినాతి కఠినమైన సూత్రాలను వివరించమన్నాడు.

బ్రాహ్మణుడు అనర్గళంగా వివరించి చెప్పాడు. సుబ్బనాచార్యులు నివ్వెరపోయాడు.

సుబ్బనాచార్యుని అహంకారం అంతమైంది. తనను శిష్యునిగా స్వీకరించమని విజయదాసుని వేడుకున్నారు. విజయకవచం గానం చేసి విజయదాసు, సుబ్బనాచార్యుణ్ణి ఆశీర్వదించాడు.

కర్ణాటక దాసకూటంలో పురందరదాసు మొదటి వారు కాగా విజయదాసు రెండవవారు.

పూర్వ జన్మలో పురందరదాసు కుమారుడే విజయదాసు అయినాడని కూడా చెప్తున్నారు.

1687లో మాన్వికి ఎనిమిది మైళ్ళ దూరంలో వున్న చీకల పర్విలో శ్రీనివాసప్ప. కూసమ్మ దంపతులకు అశ్వత్థ నరసింహ వరప్రసాదంగా విజయదాసు జన్మించాడు. ఇతని పేరు మొదట దాసప్ప. పదహారేళ్ళ వయసులో ఇతడు కాశీ వెళ్ళి సన్యాసులతో పాటు దేశమెల్లెడలా తిరిగి వచ్చారు.

హరి దాస లక్షణములను ఆయన తన శిష్యులకు ఈ మాదిరి వివరించాడు.

హరి దాస లక్షణమిది మీరు వినుడు.
గరువంబు కోపంబు కలుగ రాదింత
మద మత్సరములకు మది సోలరాదు
సదమల భక్తితో సచ్చిదానందు
విడువ భజియించి వేడ్కదేహమున
గడకొని ద్వాదశ కమనీయ నామముల
నుచ్చరించుచు కలియంగ బెట్టె తులసి
మాలలు నళుత తూగాదు చుండ
దేవతా తర తమ భావమ్ము దెలిసి
కావుమో పరమేశ కావు మమ్మనుచు
ఆదరమున గురు పాదులు గొలిచి
సాధు జనమ్ముల సత్కృ పామతిని
జూచుట హరిదాసు చరితంబగును
ఇల్లాలు కొడుకులు యింటి వారలును
ఎల్ల వేళల దాసు లీసున కనుచు
సాధు జనోచిత సద్వృత్తి లెందు
బోధ చేయుట లోక మోదమై చెలగు
వినుమది యెల్లరు విజయ విఠలున
కను విధమై చెల్లు కాశ్యపి నెపుడు
ఇట్లున్న వానికి నెన్ని జన్మముల
పాట్లుండ వెందును పరుగుగై కొనుచు
విడువక గాపాడు విజయ విఠలుడ

ఇరవయ్యో ఏట అరలమ్మను వివాహం చేసికున్నాడు దాసప్ప. దారిద్ర్యము వెన్నంటియే వుంది.

మరొకసారి కాశీ దర్శించిన దాసప్పకు పురందర దాసు కన్పించి వ్యాసకాశికి కొనిపోయాడు. వ్యాసముని అనుగ్రహం కలిగింది.

దాసప్ప నాలికపై "విజయ" అనే పదం వ్రాసి వ్యాసముని అంతర్ధానమయినాడు.

నాటినుండి చీకల పర్విదాసప్ప అపరోక్షజ్ఞానియై "విజయదాసు"గా ప్రసిద్ధుడైనాడు.

"విజయ విఠల" అంకితంగా - హరి నామస్మరణ గావిస్తున్న విజయదాసును కాశీ మహారాజు పల్లకితోను, అనేక విలువైన కానుకలతో సత్కరించారు.

కాశీ, బదరి, ఉడిపి, తిరుపతి, పండరి, బేలూరు, శ్రీరంగపురం, రామేశ్వరం మున్నగు క్షేత్రాలు దర్శిచారు విజయదాసు.

మూడవ సారి కాశీ యాత్ర పిమ్మట భాస్కర క్షేత్రమైన చిప్పగిరి (గుంతకల్లు సమీపాన) స్థిరపడినాడు విజయదాసు.

అక్కడి బావిలో లభించిన శ్రీకృష్ణ విగ్రహాన్ని భక్తితో పూజించేవాడు. 'చందప్ప' అనే గోపాలుడొకడు తన పొలంలో సగభాగం గోపాల దేవునికి సమర్పించాడు.

చిప్పగిరిలో పతితయైన ధనికురాలొకతె అహ్వానింపగా విజయదాసు ఆమె విందును స్వీకరిస్తాడు. ఆమెకు చరమ దశలో సేవచేసి అంత్యక్రియలు కూడా తానే చేశాడు దాసు.

త్యాగం, సేవ, భక్త కోటికి విజయదాసు అను గ్రహించిన ఉపదేశాలు.



# గోపాలదాసు



**ఒ**క మహాభక్తుడు ప్రతియేటా బ్రహ్మోత్సవ సమయంలో తిరుపతి వేంకటేశ్వరుని దర్శించి గానం చేసేవాడు. జీవితం ముగింపుకు వచ్చిందని తెలిసి ఇదే ఆఖరి దర్శనమంటూ కన్నడ గీతం ఆలపించాడు.

"హోగువెను బరలారే మరలి, ఇల్లి

నాగగిరి వాసా ఈశా శ్రీశా"

వెంటనే తంబుర తీగ తెగిపోయింది. భవిష్యత్తును ఖచ్చితంగా దర్శించగలిగిన ఆ మహాభక్తుడే శ్రీ గోపాలదాసు. కన్నడ దాస చతుష్టయంలో వీరు మూడవవారు. ఈయన పూర్వాశ్రమనామం భాగన్న.

కర్ణాటక లోని రాయచూరు జిల్లాలోని దేవదుర్గ సమీపాన గల మురారియా భాగన్న జన్మ స్థలం. బాల్యంలోనే ఇతని తండ్రి గతించాడు. తల్లి తన ముగ్గురి బిడ్డలతో శంకరాపురం చేరుకుంది. అక్కడ ధర్మాత్ములొకరు వారి జీవనానికి ఏర్పాటు చేశారు. కానీ, వారిని ఆ గ్రామ కులకర్ణి మిక్కిలి బాధించసాగాడు. సర్కారు నీటితో మీ భూమి పండించుకున్నారు. కనుక పంటలో వాటా తమకు అధిక భాగం ఇచ్చుకొమ్మన్నాడు.

కరుణ చూపమని ప్రాధేయపడిన భాగన్న తల్లిని అతడు కాలితో తన్ని బాధించాడు.

బాలుడైన భాగన్న తల్లిని ఊరడిస్తూ "వానినే బాగుపడనీ అమ్మా మనకు ఆ భూమి వద్దులే" అన్నాడు.

భాగన్న మాటలు శాపనార్థంగా పరిణమించి కులకర్ణి వంశమే నాశనమైంది. ఆ చెరువు కూడా ఎండి పోయినది.

పుణ్యాత్ములొకరు భాగన్నకు ఉపనయనం చేశారు. రెండు సంవత్సరాలపాటు నిశ్చలంగా భాగన్న తపస్సు చేశాడు. పిల్లవానిని అపహాస్యం చేస్తూ దుండగులు వాని శరీరంపై వేడి నీళ్ళు కుమ్మరించారు.

ఆ మహాభక్తుని శరీరం చెక్కు చెదరక పోవటమే గాక దుండగుల శరీరాలపైననే దుద్దులు కట్టాయి. అనాటి నుండి భాగన్న సామాన్యుడు కాదని అక్కడి వారు గుర్తించారు.

ఒకనాడు భాగన్న శరీరానికి పెద్ద నాగుబాము చుట్టు కొన్నది. తలపై పడగ విప్పి ఆడింది కూడా.

"అపరోక్షజ్ఞాని" అని భాగన్న కీర్తి అప్పటికే వ్యాపించింది.

గద్వాల సంస్థానంలో కవితా ప్రదర్శన గావించి సన్మానాలు అందుకొన్న త్రిలింగ దేశకవి భాగన్న దర్శనానికి వచ్చారు.

గద్వాల సంస్థానరాజు రాజారం భూపాలుడు గొప్ప దైవభక్తి గలవాడు. అతడు శంకరాపురం వచ్చి భాగన్నను దర్శించి ఆశీస్సులందుకున్నాడు.

ఉత్తనూరు చేరిన భాగన్నకు అయాచితంగా విశేష సంపద కూడినది. తన సంపదను బీదలకు అన్న దానం చేస్తూ సద్వినియోగం చేసేవాడు భాగన్న.

భాగన్న శక్తి సామర్థ్యాలను గురించి విన్న వెంకట్రామాచార్యులనే జిజ్ఞాసువు అయన శిష్యుడిగా చేరుతారు. సన్యసించిన పిమ్మట వెంకట్రామాచార్యులు "వ్యాసతజ్ఞ" గా ప్రఖ్యాతుడైనాడు.

భాగన్న శిష్యునితో గాయత్రీ జపం చేసేవాడు. ఒకనాటి అర్థరాత్రి అర్ఘ్యం యిస్తున్నారు. వేళదాటినది కనుక ప్రాయశ్చిత్తంగా మరొక సారి అర్ఘ్యం యివ్వడానికి శిష్యుడు సిద్ధమైనాడు. భాగన్న తలుపు తెరిచేసరికి ఆశ్చర్యంగా అస్తమిస్తున్న సూర్యుడు దర్శనం అవుతోంది.

గురువు తపః శక్తికి వ్యాస తత్త్వజ్ఞ అంజలి ఘటించాడు.

గాయత్రీదేవి కరుణతో ఆశుకవిత అలవడిన భాగన్న అనేక పుణ్యక్షేత్రాలు

దర్శించాడు. కాశీలోని జయదాసు భాగన్నకు "గోపాల విఠల" అంకిత మిచ్చి అనుగ్రహిస్తాడు. నాటినుండి "గోపాలదాసు"గా భాగన్న కీర్తి దశదిశలా వ్యాపించింది.

గోపాలదాసుచే ప్రభావితులైన మహారాష్ట్రులు కీర్తన పద్ధతిని తమ దేశంలో ప్రచారం సాగించారు.

ఉడిపి వెళ్ళే మార్గములో గోపాలదాసు బృందాన్ని భీమన్న నాయకత్వాన గల దుండగల ముఠాముమ్మారు ఎదుర్కొన్నది.

మొదటి కనుమ వద్ద దుండగులు ఎత్తిన చేతులు స్తంబించి పోయినవి. రెండవ కనుమవద్ద అంధులై పోయినారు. మూడో కనుమ వద్ద వారి నోరు మూగపోయింది. అప్పటికి గానీ వారికి బుద్ధిరాలేదు.

పశ్చాత్తాపం ప్రకటించిన దొంగల ముఠాను గోపాలదాసు క్షమించి ఆశీర్వదించారు.

గోపాలదాసు గణపతి అంశగా ఎన్నబడినాడు. ఆయన గీతాలలో ఎక్కడా గణపతిని స్తుతించక పోవడంలోని ఆంతర్యం యిదే!

శ్రీనివాసాచార్య అనే శిష్యుడు అనారోగ్యంతో బాధపడుతూ విజయదాసుని శరణు వేడతాడు.

విజయదాసు అతణ్ణి గోపాలదాసు వద్దకు పంపుతాడు.

గోపాలదాసు కరుణతో స్తోత్రం చేస శ్రీనివాసా చార్యుణ్ణి రోగ విముక్తుణ్ణి చేస్తాడు.

గోపాలదాసు వెంట తాను తిరుపతికి వస్తానని శ్రీనివాసాచార్యుడు ప్రాధేయపడతాడు.

శరీరానికి బలం చేకూరే వరకు ఆగమని గోపాలదాసు హితవు చెపుతాడు. కానీ, శిష్యుడు తన పట్టు విడువలేదు.

తిరుమల క్షేత్రంలో గురుశిష్యులు చెరి ఒక విడిదిలో బసచేశారు.

శిష్యుడిని బసలో చూడడానికి వచ్చిన గోపాలదాసునకు అతని శరీరం అనంత వాయువుల్లో కలిసిపోయి నట్లు కన్పించింది.

ఇంతలో తమ గురువు విజయదాసు సూక్ష్మరూపంలో కన్పిస్తాడు. తన ఆయుర్దాయాన్ని శ్రీనివాసాచార్యునికి దానం యివ్వమనిఆదేశిస్తాడు.

వెంటనే గోపాలదాసు ధన్వంతరి రూప శ్రీనివాసుని ఇలా ప్రార్థించాడు.

ఎన్నభిన్నిప కేళోధన్వంత్రి దయమాణ
సణ్ణవను ఇవ కేవల
బన్నవడి సువ రోగ వన్ను మోచన మాడి
చెన్నాగి పాలిసువుదొ కరుణి

తన జీవితంలో నలభై సంవత్సరాలు శ్రీనివాసాచార్యునికి ధారాదత్తం చేశాడు.

శ్రీనివాసాచార్యుడు నిద్రనుండి లేచినట్లు పునరుజ్జీవితుడైనాడు. నిండు మనస్సుతో తన బృందానికి విందు చేసిన గౌడుని అతిథిగా వెళ్ళి ఔదార్యం ప్రకటించాడు గోపాలదాసు.

గోపాలదాసు గొప్ప చిత్రకారుడు కూడా. భక్తులకు పూజ చేసుకోవడానికి విరాట్ స్వరూపాన్ని చిత్రించి ఇచ్చేవాడు.

స్త్రీలకు స్వాతంత్ర్యం అవసరమని గోపాలదాసు మతం. ఆయన శిష్య వర్గంలో కొందరు కవయిత్రులు వుండినరు.

గోపాలదాసు అంత్యదశ తెలిపే గాథ చిత్రంగా వుంది.

దేహత్యాగం చేసిన నాడు దర్భాసనం మీద ధ్యానంలో కూర్చొని స్వామికి సహస్రనామ పూజచేయమన్నాడు. శిష్యులను భోజనం చేయటానికి అనుజ్ఞ యిచ్చాడు. వారు లేచి చూచేసరికి గోపాలదాసు దేహం జీవరహితమై కన్పించింది.

గోపాలదాసు చిరకాలం సేవించిన ఉత్తనూరు శ్రీవేంకటేశ్వర మందిరంలో ఈనాటికీ క్రింది మంగళ స్తోత్రం పఠించబడుచున్నది.

మంగళం మంగళం దయానిధే
నంద నందన శ్యామ సుందర శుభాయ
ఇందీవరాక్ష ముకుంద మురారీ

॥మంగళం॥

దేవ దేవేశనె దేహి కల్యాణం
శ్రీవర శ్రీకర శ్రీశ్రీనివాసా

॥మంగళం॥

రాజిత వరద గోపాల విఠల మహా
రాజ భకత కల్పభూజా సుతేజా

॥మంగళం॥



# జగన్నాథ దాసు



రాయచూరు జిల్లాలోని "మాన్వి" సమీపములో గల "బ్యాగవట్టి"లో నరసింహదాసు దంపతులు వుండేవారు. వేంకటేశ్వరస్వామి భక్తులైన వీరు క్రీ.శ. 1726లో తిరుపతి దర్శించి వంశోద్ధారకుని కోసం స్వామిని ప్రార్థించారు.

వారి కోరిక స్వామి నెరవేర్చారు. 1727లో కలిగిన మగ బిడ్డకు తమ దైవము పేరనే 'శ్రీనివాస'ని పిలువసాగారు.

తొలుత తండ్రిచెంత, పిమ్మట మంత్రాలయ మఠములో విద్యాభ్యాసము చేసిన శ్రీనివాసు శాస్త్రాలన్నీ క్షుణ్ణంగా నేర్చాడు. గురువుచేతనే "ఆచార్య"డనే బిరుదు సంపాదించాడు. గురుకులం పెట్టి విద్యా దానము చేస్తూ జీవితయాత్ర సాగించాడు శ్రీనివాసులు.

శాస్త్ర పండితులకు సహజంగా వుండే అహంభావము శ్రీనివాసునకు వుంటూ వచ్చింది. పైగా "హరిదాసు" లంటే వీరికి చిన్నచూపు.

దేశమంతటా భక్తి ప్రబోధం చేస్తూ విజయదాసు 'మాన్వి' వచ్చాడు. గ్రామ మంతటా సంకీర్తనలు చేసుకుంటూ శ్రీనివాసాచార్యుల ఇంటికి విచ్చేశాడు. అచటి వారికి ఎలాంటి స్వాగతము లభించలేదు.

ఒకనాడు విజయదాసే గ్రామస్థులకు తన విడిదిలో విందు ఏర్పాటు చేశాడు. ఆచార్యుల వారినీ ఆహ్వానించాడు. భోజన వేళకు ఆహ్వానితులు అందరూ వచ్చినా

శ్రీనివాసాచార్య రాలేదు.

విజయదాసు వారి కోసం కబురు పెట్టాడు. తనకు అస్వస్థతగా వుండడం మూలాన ముందుగానే భోజనం చేశాననీ విజయదాసు తెలియజేశాడు.

దాసు సాలోచనగా "ఓహో! అలాగా" అన్నారు. అంతే! విజయదాసు శపించి నాడో అన్నట్లు శ్రీనివాసాచార్యకు తీవ్రమైన కడుపు నొప్పి ప్రారంభమయింది. ఎన్నో వైద్యాలు చేశాడు. తీర్థ యాత్రలు చేశాడు. ఫలితం లేదు.

ఒకసారి మంత్రాలయంలో స్వామి సేవలో నుండగా స్వప్న దర్శన మయింది.

విజయదాసు ఎడల చేసిన అపచారం గుర్తుకు వచ్చింది. అనారోగ్యంతో శుష్కించిన ఆచార్యుల వారు మిక్కిలి శ్రమపడి విజయదాసు అవాసమైన చీకలపర్రి చేరుకున్నారు. విజయదాసు పాదాల మీద వ్రాలి క్షమాపణ వేడుకున్నాడు.

దాసు, ఆచార్యులను, లేవనెత్తి ఎంత వారికీ కర్మబంధాలు తప్పవనీ, తన శిష్యుడైన గోపాలదాసును దర్శించమని ఆదేశిస్తాడు.

గోపాలదాసు ఆచార్యుల వారిని ఏ విధముగా కరుణించినదీ వెనుకటి గోపాలదాసు జీవితములో తెలుపబడింది.

శ్రీనివాసాచార్యులు గురుదేవుల ఆనతి మీద పండరిపురం చేరి శ్రీవిఠలుని ఇలా కీర్తిస్తాడు.

**విఠలయ్యా విఠలయ్యా**
**తటీ త్కోటి నిభకాయ**
**జగన్నాథ విఠలయ్యా విఠలయ్యా**
**భజిసువె నిన్నను అజభవ సురనుత**
**భజకామరతరు కుజన కుఠార**
**నీకరుణి సదె నిరాకరిసలు ఎన్న**
**సాకు వరారు దయాకర మూరుతి**
**శరణాగతరను పొరెవె నెంబతవ**
**బిరుద కాణో కరి వరద జగన్నాథ** ॥విఠలయ్యా॥

అక్కడి చంద్రభాగా నదీ తీరంలో స్నానం చేస్తూండగా శ్రీనివాసాచార్యులకు చిన్నస్ఫటికం దొరికింది. దానిపై "జగన్నాథ విఠల" అని వ్రాయబడి వున్నది. ఆనాటి నుండి శ్రీనివాసాచార్య జగన్నాథ దాసుగా ప్రఖ్యాతుడైనాడు.

పన్నెండు దినాలు శ్రీవిఠలుని దర్శనం లభించక నిరాశ చెందిన

శ్రీనివాసాచార్యునికి మరుసటి దినం బ్రాహ్మణ వేషధారియై స్వామి మృష్టాన్నంతో విందు చేస్తాడు.

పండరి నుండి బయలుదేరి జగన్నాథ దాసు వేణీ సోమాపురంలో గోపాలదాసుని దర్శించారు. గోపాలదాసు వారిని హరిసేవ, లోకసేవ, ధర్మ ప్రచారం చేయవలసినదిగా ఆనతి యిచ్చారు.

చీకలపర్వి అశ్వత్థనారాయణుని సేవిస్తున్న విజయదాసుని కూడా శ్రీదాసు దర్శనం చేసుకొన్నాడు. వారి ఆదేశాను సారం విజయ యాత్ర గావించాడు.

మధ్య కర్ణాటక రాష్ట్రంలో గల సురపుర సంస్థానాన్ని జగన్నాథ దాసు దర్శించాడు. అక్కడ ఒక పేద బ్రాహ్మణ్ణి అనుగ్రహించాడు. దాసు ఆశీస్సులతో కొంత కాలానికి అతడు సురపుర దివాను పదవిని చేరుకున్నాడు. జగన్నాథ దాసు బేలూరు, శ్రీరంగ పట్టణము. మేల్కోటే మొదలగు అనేక పుణ్యక్షేత్రాలు దర్శించారు.

"కర్జిగి" గ్రామంలో వుండగా దాసప్ప అనే పతితుణ్ణి అనుగ్రహించి అతనిని భక్తునిగా మార్చినాడు. అతని వేశ్య తన గత జీవితంపై విరక్తి గల్గి "దేవదాసి"గా మారి పోయింది.

ఉడిపిలో అష్ట మఠాధిపతులు శ్రీ జగన్నాథ దాసును ఘనంగా సన్మానించారు.

ఆ కాలమున ఉత్తరాది మఠమున శ్రీ సత్యబోధ తీర్థులు అధిపతులుగా వుండేవారు. వారు పూర్వాశ్రమమున భూవరాహమూర్తిని అర్చించెడివారు.

శ్రీరామ దర్శనమునకై ధ్యానించు చుండిరి. కానీ, వారికి అది వరహమూర్తియే దర్శన మిచ్చు చుండిరి. తీర్థుల వారికిది కొత్తగా వుండెడిది.

జగన్నాథ దాసులు అది గమనించి "పూర్వమూర్తియే ఉండనిండు" అనిరి.

తీర్థులు. దాసుల వారి జ్ఞానమునకు ముగ్ధులైరి. నాటి నుండి పూజానంతరం హరినామ సంకీర్తనం మఠంలో ప్రవేశపెట్టబడి నేటికినీ కొనసాగుచున్నది.

చిరకాలం ధర్మ ప్రచారం చేస్తూ ఎనభైరెండవయేట జగన్నాథ దాసు కాలధర్మం చెందాడు.

"హరికథామృత" చరమ దశలో రచించిన తత్త్వ వివరణ గ్రంథం కాగా "తత్త్వసువ్వాలి" కీర్తన గ్రంథం.

పురందర దాసుచే ప్రతిపాదించిన భాగవత ధర్మ ప్రచారానికి శ్రీ జగన్నాథ దాసు చేసిన సేవ నిరుపమానం.



# కనకదాసు



కర్ణాటక దేశంలో పదహారవ శతాబ్దానికి చాలా ప్రాధాన్యత వుంది. వ్యాసరాయలు, పురందరరాసు, వాదిరాజు మొదలుగా గల మహనీయులు నివసించిన కాలమది. వీరి కోవకు చెందిన దాస శిఖామణి కనకదాసు.

కనకదాసు మొదటి పేరు తిమ్మప్ప. జన్మస్థలం ధార్వాడ జిల్లా బంకపుర తాలూకాలోని బాడ గ్రామం.

ఈయన తల్లి దండ్రులు బుచ్చమ్మ, బీరప్ప, వీరు తిరుపతి శ్రీ వేంకటేశ్వర స్వామి భక్తులు. స్వామి వర ప్రసాదంగానే వీరికి తిమ్మప్ప జన్మించారు.

కురుబ కులానికి చెందిన బీరప్పనాయక్ శ్రీ వైష్ణవ మతాన్ని స్వీకరించాడు. తిమ్మప్ప జన్మించిన కొలది దినాలకే బీరప్ప నాయకుణ్ణి లక్ష్మీదేవి కటాక్షించింది. విజయనగర కొలువులో జిల్లాస్థాయి ఉద్యోగం దొరికినది. వారి యింట లక్ష్మీదేవి తాండవించడంతో తిమ్మప్ప పేరు కనక నాయక్‌గా మారింది.

కాలక్రమాన బీరప్ప నాయక్ కాలధర్మం చెందగా కనక నాయక్ తండ్రి ఉద్యోగం స్వీకరించాడు. ఆయన జీవితం ఆనందంగా గడచిపోయింది.

కనకదాసు "కాగినేతి" అనే గ్రామంలో గొప్ప దేవాలయం నిర్మించాడు. దానిలో "ఆదికేశవస్వామి"ని ప్రతిష్టించాడు.

వైభవంగా స్వామి పూజాదికాలకు తగిన ఏర్పాట్లు చేశారు.

పురందర దాసు మాదిరే భగవత్ ప్రేరణతో కనక నాయక్ భోగభాగ్యాలు త్యజించాడు.

తంబుర ముందుంచుకొని ఎల్లవేళలా ఆది కేశవ స్వామిని భక్తి గీతాలతో సేవించ సాగాడు. నాటి నుండి కనకనాయక్ 'కనకదాసు'గా విఖ్యాతుడైనాడు.

మధ్వ సాంప్రదాయమును అవలంబించి వ్యాసరాయల శిష్యుడైనాడు. మిక్కిలి వినయంతో తనకు ఏదైన మంత్రోపదేశం చేయుడని కనకదాసు వ్యాసరాయలను ప్రార్థించాడు.

కురుబ కులస్థునికి దివ్యమంత్రాలను ఉపదేశం చేయటానికి ఇష్టంలేక "దున్నపోతు" మంత్రాన్ని కనకదాసుకు వ్యాసరాయలు ఉపదేశించాడు.

శ్రద్ధతో మంత్రం ధ్యానం చేయగా యముని వాహనం అతనికి ప్రత్యక్షమయింది. మహిషంతో సహా దాసు తమ గురువుని దర్శించాడు.

వ్యాసరాయలు కనకుని దీక్షకు ఆశ్చర్యపోయాడు.

తాను నిర్మింపజేస్తున్న తూముకు అడ్డు వుస్తున్న పెద్ద బండను యముని వాహనంచే ప్రక్కకు తొలగింప జేశాడు.

ఒకనాడు పురందరదాసు వ్యాసరాయలతో సహా పలువురు విద్వాంసులు సభ తీర్చారు. వారిలో కనకదాసునకు మాత్రమే సంస్కృతం రాదు.

"మోక్షానికి అర్హులు ఎవరు?" అని సభలో ప్రశ్నవచ్చింది.

సంస్కృత పండితు లెవ్వరూ సరియైన సమాధానం చెప్పలేక పోయారు. చివరకు కనకదాసు లేచి "నేను పోతే మోక్షానికి పోతాను" అని చెప్పాడు.

సభలోని పండితులు కురుబవానికి మోక్షమా? అని అసూయ పడినారు. కనకదాసు వారి భావాన్ని గ్రహించి తన పలుకులోని అంతరార్థాన్ని ఇలా వివరించాడు.

'నేను అనగా అహం భావం అని అర్థం. ఇది నశించిన వారే మోక్షానికి అర్హులు'

ఒకసారి తమ కులదైవమైన శ్రీవెంకటేశ్వరుని దర్శించడానికి కనకదాసు వెళ్ళాడు. సాధారణ వ్యక్తిగా భావింప బడిన దాసుకు దైవదర్శనం లభ్యం కాలేదు.

ఒక మారుమూల చలిచే బాధపడుతూ నిద్రించాడు కనకదాసు. తన పట్టు వస్త్రాన్ని అతనిపై కప్పి స్వామి అంతర్ధానమౌతాడు.

ఆలయాధికారులు కనకుని దొంగ అని తలచి వాతలుపడునట్లు చావ మోదారు. మరునాడు స్వామి వారి విగ్రహంపై వాతలుండడం గమనించి తన అపచారాన్ని మన్నింపమని కనకుని వేడుకొంటారు.

కనకుని అపహాస్యం చేయాలని తలచిన వారందరూ తామే అవమానముల పాలైనారు.

వ్యాసరాయలు ఒకసారి దేవుని దర్శనం చేయించుతావా? అని కనకుని ప్రశ్నించాడు. మరునాడు పూజా సమయానికి తప్పక చేయింతునని కనకదాసు సమాధానం చెప్పాడు.

పూజా సమయానికి శునక రూపంలో ఆదికేశవ స్వామి విచ్చేశాడు. వ్యాసరాయలు అంటరానిదని దానిని దూరంగా తరిమి వేశాడు. దైవదర్శనం

చేయించజాలని కనకుని అక్కడి వారు పరిహసించారు.

శునక రూపంలో వచ్చినవాడు భగవంతుడే అని కనకుడు చెప్పగా పరిశుద్ధ రూపంలో కావాలన్నారు వ్యాసరాయలు. మరునాడు అలాగే జరుగునని చెప్పాడు కనకదాసు.

మంగళహారతి వేళకు దేవతా సర్పం ఒకటి స్వామి ముందట ప్రత్యక్షమయింది. బ్రాహ్మణ స్వాములంతా భయంతో పారిపోయారు. వ్యాసరాయలు సమర్పించిన పాలుత్రాగి నాగరాజు అదృశ్యుడైనాడు.

ఇలాంటి అద్భుత సంఘటలెన్నో కనకదాసు చరిత్రలో చోటు చేసుకున్నవి. ఒకసారి కనకదాసు ఉడిపి వెళ్ళి శ్రీకృష్ణుని దర్శనం అపేక్షించాడు.

కృష్ణమందిరంలో పూజలు సలుపుతున్న సర్వాయి యతులు ఆలయ ప్రాంగణంలోనికి దాసుని ప్రవేశం నిరాకరించారు.

కనకదాసు నిశ్చల భక్తితో ఆలయం వెలుపల నుండే శ్రీకృష్ణుని ధ్యానించాడు. ఇంతలో చిత్రంగా గర్భగుడి పడమటి వైపు గోడపై భాగంలో కొన్ని యిటుకలు రాలిపడి చిన్న కిటికీ ఏర్పడింది. దానికుండా కనకదాసు శ్రీకృష్ణుని దర్శనం చేసుకున్నాడు. అంతేకాదు శ్రీకృష్ణుడు భక్తునికై పశ్చిమాభి ముఖంగా నిలిచాడు. ఈ కిటికీ "కనకుని గండి"గా చిరస్థాయిగా నిలిచి పోయింది.

కనకదాసు విగ్రహం ఉడిపి శ్రీకృష్ణ మందిరంలో ఇటీవల ప్రతిష్టించారు. కనకదాసు సామాన్య పాఠకులకు అర్థమగు రీతిలో "హరి భక్త సారము" "మోహన తరంగిణి" మున్నగు గ్రంథాలు రచించాడు.

**కులాన్ని పరిహసిస్తూ దాసు ఇలా పాడాడు**

**ఆత్మ ఏ కులము?**

**జీవము ఏ కులము?**

**పంచేంద్రియముల కుల మెయ్యది?**

**అంతరాత్మలో నెలకొని యుండి**

**ఆది కేశవునకు ప్రీతి పాత్రుడైన**

**వారికి యిట్టి కులమేల?**

భక్తి తాత్పర్యంతో తొంభై ఏళ్ళు జీవించిన కనకదాసు ఆదికేశవస్వామిలో ఐక్యమయినాడు.



# బసవేశ్వరుడు



కర్ణాటక దేశంలోని కల్యాణ నగరంలో రాజాస్థానములో గణికులు ఆదాయ వ్యయాలను లెక్కలు చూచుకుంటున్నారు.

ఒక నూతన ఆగంతకుడు ఒకింత దూరము నుండి తదేక దృష్టితో ఆ కార్యక్రమం గమనిస్తున్నాడు. ఆయువకునికి ఒక దోషం కన్పించింది. నిర్భయంగా ఆ విషయం విన్నవించాడు. సిద్ధదండాధీశుడు ఆయువకుని కుశలతకు మెచ్చి రాజ దర్శనం కలిగించాడు.

12వ శతాబ్దములో కర్ణాటక దేశాన్ని పాలించిన బిజ్జలుని కొలువు చేరిన ఆ యువకుడే బసవేశ్వరుడు.

రాజ భండారంలో చిన్న ఉద్యోగిగా ప్రవేశించిన బసవేశ్వరుడు భాండాగారమునకు ప్రధాన అధికారియై భండారీ బసవడుగా ఖ్యాతి నందినాడు.

"బాగేవాడి" బసవని జన్మస్థలం. తండ్రి మాదిరాజు, తల్లి మాదాంబ. పిన్న వయస్సుననే శైవ పురాణ గాధలను ఆకళింపు చేసుకొన్న బసవనికి కర్మకాండపై విశ్వాసం పూర్తిగా పోయింది.

తగిన వయస్సు రాగానే బసవునికి వడుగు చేయాలని తల్లి దండ్రులు నిశ్చయించగా ఉపనయన కర్మ పట్ల విముఖుడై బసవడు ఇంటి నుండి పారిపోయాడు.

"కూడలి" అన్న పుణ్యస్థలం చేరిన బసవుడు అక్కడ వేంచేసి యున్న సంగమదేవుణ్ణి నిష్ఠతో ధ్యానించాడు.

శివుడాతనికి కలలో కన్పించి అభయమిచ్చాడు. మరు దినము శుచి స్నాతయైన బసవనికి నందీశ్వరుడు పంచాక్షరి ఉపదేశించి చేతిలో చిన్న శివలింగము పెట్టి వెళ్ళాడు.

శివుని ఆన మేరకు బసవడు మంగళవాడ (కల్యాణ పురం) చేరు కుంటాడు.

అతనికి రాజాదరణ లభించిన వైనము మొదట తెలుప బడినది.

మహాభక్తుడై బసవడు భండార ప్రధాన అధికారిగా, భక్త భండారిగా గణన కెక్కినాడు. సామర్థ్యమునకు నిజాయితీ తోడుకాగా భక్త భండారి బిజ్జలుని ప్రధానమాత్య పదవి అందుకున్నాడు.

ఒక వైపు రాజ్య పాలనలో ప్రధాన భూమిక నిర్వహిస్తూ బసవడు భగవద్భక్తి వ్యాప్తికి నిరంతర కృషి చేశాడు.

అతని బోధనలలోని సమదృష్టి పలువురిని ఆకర్షించింది. వీరశైవ మతానికి తిరిగి పట్టం కట్టిన బసవని ఖ్యాతి కర్ణాటకపు ఎల్లలుదాటి ఆంధ్రదేశములోనూ వ్యాప్తి చెందినది.

ప్రతి నిత్యము లక్షా తొంభై ఆరువేల మంది జంగములకు మృష్టాన్నములతో అర్చించి అనంతరం తాను భుజించే వాడు బసవేశ్వరుడు.

బసవడు తన ఉపదేశాలు ప్రజలకు అందుబాటులో ఉండే రీతిగా వచనాలు వ్రాసాడు. వీటిలో సూక్ష్మమైన తత్త్వం సులువుగా బోధపడేది.

సాహిత్య పరంగా కూడా బసవేశ్వరుని వచనాలకు చక్కని గౌరవం లభించింది

ఇతడు మొత్తం 64 లక్షల వచనాలు కూర్చినట్లు ప్రతీతి. కానీ, ఈనాడు కొన్ని వేలు మాత్రమే మనకు లభ్యమౌతున్నవి.

దేహమే దేవాలయం అనే భావన బసవడు ఒక వచనంలో ఇలా వ్రాశాడు.

ధనవంతులు నిర్మింతురు నీకై
ధగద్ధగోజ్వల గోపురాదులను
ధనము లేని బడుగును నే నెట్టుల
తమకై కట్టుదు శివాలయంబును?
స్వామీ! కూడల సంగమదేవా!
చెడును స్థావరమును జంగమ మిదిగో
పాదము లివి ఆలయ కంబములు
పసిడి కలశమగు నాశిర మిదిగో
నడిచెడి యీ దేవాలయమ్ములో
నివసింపుము శ్రీసంగమేశ్వరా!

వీరశైవంలో కులబేధం పనికిరాదు. బసవేశ్వరుడిలా ప్రశ్నిస్తాడు.

**అగ్రజుడెవ్వరు? అంత్యజుడెవ్వడు**
**బ్రాహ్మణుడెవ్వరు? శ్వప చుండెవ్వరు?**
**భక్తు లెల్ల శ్రీసంగమ కులజులు**
**కల్లయైన నా ముక్కును చెక్కుము**

మరొక వచనములో కులానికి జన్మకారణం కాదంటూ....

**"ఉత్తమ కులమున కథమ కులమ్ముకు**
**ఉత్త జన్మమే కారణ మెట్లగు?**
**హింసాత్మకుడగు వాడే మాదిగ**
**నీచు భుజించెడి వాడే మాలఁడు**
**సర్వ జీవహిత మెవడు కోరునో**
**సంగమ దేవ కులస్థుం డాతడు".**

భక్తికి సరియగు నిర్వచనం బసవేశ్వరుని క్రింది వచనంలో చూడగలము.

**"భక్తి వంద నమె భక్తి" యనంబడు**
**మృదు వచనంబే "మంత్ర" జపంబగు**
**మృదు వచనంబే మంత్ర తపంబగు**
**సద్వీన యంబే "శివ ప్రణయ" మగు**
**గుణ హీనమ్మగు కొంగ భక్తి నిల**
**కూడల సంగము దేడ వలచు మణి"**

మానవ ప్రవర్తన గూర్చిన బసవని వచనమిది.

**"దొంగలింపకుము, హత్యల చేయకు**
**కల్లల నాడకు, కోపగింపకుము**
**ఆత్మస్తుతి పరనిందల విడువుము**
**బాహ్యం తశ్శుద్ధుల భావమ్మిదె"**

(బసవని గీతాలకు శ్రీ ముదిగొండ శివప్రసాద్ తెలుగుసేత)

బసవేశ్వరుడు స్థాపించిన వేదాంత గోష్టికి "అనుభవమంటపం" అని పేరు. ఇందులో హరిజనుడైన హరళయ్య చాకలి మాచయ్య మేదర చెన్నయ్య, అక్క నాగాంబిక ఇందలి సభ్యులు. కార్యదర్శి చెన్న బసవేశ్వరుడు. ఇతడు బసవేశ్వరుని మేనల్లుడు.

బసవేశ్వరుడు తన చేతుల మీదుగా ఒక వర్ణాంతర వివాహం జరిపాడు.

అది సంఘంలో తీవ్ర వ్యతిరేకతకు దారి తీస్తుంది. దురదృష్టం కొద్దీ నూతన దంపతులు హత్యకు గురి అవుతారు.

ఈ సంఘటన బసవేశ్వరుని హృదయాన్ని కలచి వేస్తుంది.

తన అమాత్య పదవిని వదలి బసవేశ్వరుడు కూడలి సంగమేశ్వరుని సన్నిధికి వెళ్తాడు. కొంత కాలానికి ఆయనలో లీనమైపోతాడు.

కాయకమే కైలాసమని చాటి శ్రమ జీవనానికి గౌరవస్థానం కల్పించిన బసవేశ్వరుడు నందీశ్వరుని అవతారంగా భావింపబడినారు.

బసవేశ్వరుని దివ్య జీవనగాథ తెలుపుచున్న పాల్కురికి సోమనాథుని "బసవ పురాణం" తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధమయింది.



# అప్పర్



అది క్రీస్తు తరువాత ఏడవ శతాబ్దం. దక్షిణ దేశంలో జైనమతం మంచి జోరు మీద వుంది.

ఆ కాలంలో పుట్టిన శివభక్తులలో అప్పర్ అగ్రేసరుడు. ఇతని జన్మస్థలం దక్షిణ ఆర్కాటు జిల్లాలోని తిరువాయూరు.

అప్పర్ అసలుపేరు మారుల్ నెక్కియార్. 'జ్ఞానసంబందర్' అనే భక్తుడు ఇతనిని "అప్పా" అని పిలిచాడు. నాటినుండి మారుల్ నెక్కియార్ అప్పర్ అయినాడు.

ఈతని తండ్రి పూగళ్‌నార్, తల్లి మదినాయర్, అక్క తిలకవతి.

తిలకవతికి పన్నెండేళ్ళ వయస్సులో తల్లి దండ్రులు కాలిప్పాగై నాయనార్ అనే సైన్యాధిపతితో వివాహము నిశ్చయించారు. వరుడు యుద్ధభూమి నుండి తిరిగివచ్చి పెండ్లాడతానని చెప్పాడు.

ఈలోగా పూగళ్‌నార్ చనిపోయాడు. ఆయన భార్య మదినాయర్ సహగమనం చేసింది.

దురదృష్టం కొద్దీ తిలకవతికి నిశ్చయమైన వరుడు కాలిప్పాగైనాయనార్ యుద్ధంలో చనిపోయాడు. తిలకపతి తాను సహగమనం చేస్తానన్నది. కానీ, తమ్ముడు ఒంటరిగా బ్రతక లేనన్నాడు. ఆమె తన నిర్ణయం మార్చుకున్నది.

ప్రాపంచిక భోగాలంటే మారుల్ నెక్కియార్‌కు విరక్తి కలిగినది. సన్యాసం స్వీకరించాడు. కడలూర్ సమీపాన గల శ్రవణ మఠం చేరాడు. అది జైన పీఠం.

త్వరలోనే దానికి అధిపతి అయినాడు ధర్మసేనుడనే పేరుతో పీఠపాలన చేయసాగాడు.

ఈ విషయం తెలిసిన తిలకవతి చాలా బాధ పడింది. తన యిష్టదైవం వీరస్థానేశ్వరుణ్ణి ఆమె ప్రార్థించింది. స్వామి ఆమెకు అభయ మిచ్చాడు.

తమ్ముడు సరియైన మార్గంలో రాగలడని ఆమెకు నమ్మకం కుదిరింది. ఇంతలో ఆశ్రమంలో వున్న మారుల్ నెక్కియార్‌కు విపరీతమైన కడుపు నొప్పి వచ్చింది.

ఆశ్రమ వాసులు ఎంత ప్రయత్నించినా బాధ తొలగలేదు. అప్పుడు మారుల్ నెక్కియార్‌కు తన సోదరి గుర్తుకు వచ్చింది. ఆమెను ఆశ్రమానికి తీసుకొని రమ్మని పరిజనాన్ని పంపాడు. కాని ఆమె రాలేదు.

ఒకనాటి అర్ధరాత్రి మారుల్ నెక్కియార్ శ్రమణ మఠం వదలి తన స్వగ్రామం చేరుకున్నాడు. తలుపులు తట్టి పిలిచిన తమ్ముని గొంతు విని అక్క వెంటనే గుర్తు పట్టింది. అతడు ఆమె కాళ్ళపై బడి క్షమించమని కోరాడు.

పంచాక్షరీ మంత్రం జపిస్తూ యిష్టదైవమైన వీరస్థానేశ్వరుణ్ణి ప్రార్థించారు. భక్తి ఆవేశంతో నెక్కియార్ స్వామినా స్తుతిస్తూ పది గీతాలు పాడాడు. అతని కడుపు నొప్పి మాయమయింది.

ఆనాటి నుండి అప్పర్ పాడిన పాటలను పాడుకొన్న వారంతా రోగవిముక్తు లౌతున్నారు.

అప్పర్ తిరిగి శైవమతం స్వీకరించడం జైనులకు కంటకమైనది. జైనులు ఫిర్యాదు చేసి అప్పర్‌ను దండించమని రాజును వేడుకున్నారు.

రాజు పిలువనంపినా అప్పర్ రాజమందిరానికి వెళ్ళలేదు. తాను భగవంతునికే బానిస గానీ మరెవ్వరికీ సేవకుణ్ణి కాదని అప్పర్ భావన.

తనను ధిక్కరించిన అప్పర్ పట్ల రాజు ఆగ్రహించాడు. నానా బాధలు పెట్టాడు. ప్రహ్లాదుని కాపాడిన నరసింహుడి వలె దైవమే అతణ్ణి రక్షించింది.

అప్పర్ మీదికి మదపుటేనుగును పంపారు. ఐదు ఏనుగులను (పంచేంద్రియాలను) సంహరించే ఈశ్వర భక్తుణ్ణి తనను ఇది ఏమి చేయగల దంటూ ఒక పాట పాడాడు. అప్పర్‌కు ప్రదక్షిణం చేసి ఆ ఏనుగు వెళ్ళిపోయింది.

చివరగా అప్పర్‌ను పెద్ద బండకు కట్టి సముద్రంలోకి పడవేశారు. సంసార మనే సముద్రాన్ని దాటించే ఈశ్వరుణ్ణి స్తుతించాడు అప్పర్. అతని శరీరానికి కట్టిన బండ పడవగా మారింది. క్షేమంగా మరొక తీరానికి చేర్చింది.

పల్లవ రాజైన మహేంద్రవర్మ అప్పర్ దైవభక్తికి ముగ్ధుడై తనను క్షమించమని వేడుకొన్నాడు.

దేవాలయ పరిసరాలు శుభ్రపరిచేందుకు అప్పర్ ఒక పార చేతబూనాడు. శుభ్రం చేసే మార్గంలో రాళ్ళు ముళ్ళతో పాటు రత్నాలు, రవ్వలూ కన్పించేవి. కానీ, వాటినీ అప్పర్ అలాగే తోసి పారవేసే వాడు.

అప్పర్ అనేక దివ్యస్థలాలు దర్శిస్తూ చిదంబరం చేరాడు. నటరాజస్వామిని సేవించి శీర్కాళి చేరాడు.

పార్వతీదేవి అనుగ్రహాన్ని అందుకున్న సంబంధర్ అక్కడ అతనికి తటస్థ పడినాడు.

మారుల్ నెక్కియార్ అతని పాదాలపై పడినాడు. అతనిని లేవనెత్తి "అప్పా" అని పిలిచాడు సంబంధర్.

అప్పర్ సంబంధర్ వెంట అనేక దివ్య స్థలాలు దర్శించాడు. ఒకసారి వేదారణ్యం వెళ్ళారు ఇరువురు భక్తులు.

వేదాలు రూపుదాల్చి ప్రత్యక్షం కాగా భక్తులు అర్చనలు సలిపి ఆలయాన్ని ఏనాడో మూసి వేశారు.

అప్పర్ పది గీతాలు గానం చేసి తలుపులు తెరువమని కోరాడు. పదకొండో గీతంలో స్వామిని నిందిస్తూ ఇలా పాడాడు.

**"రావణుడు కరముచే కైలాస మెత్తితే**
**నీ వ్రేలితో అట్లే అణగ ద్రొక్కి వేయేండ్లు**
**కష్ట పెట్టావు అట్టి నీకు కరుణ**
**ఎలా వస్తుంది?"**

వెంటనే తలుపులు తెరుచుకున్నాయి.

అప్పర్ తాను భగవత్ సేవకుణ్ణి అని చెప్పాడు. భాగవతుల సేవ కూడా భగవత్ సేవే అని అతడు భావించాడు.

అప్పర్‌ను కలుసుకొనే నిమిత్తం సంబంధర్ తిరుపందుర్తికి పల్లకిలో విచ్చేశాడు. అప్పర్ పల్లకీ మోసే బోయీలతో సంబంధర్‌కు కన్పించాడు. అతని ధ్యాస భావం సంబంధర్‌ను ముగ్ధుణ్ణి చేసింది. అప్పర్, జ్ఞాన సంబంధర్ రచించిన భక్తి గీతాలు 'తేవారాలు'గా మిక్కిల ప్రసిద్ధము.



# మాణిక్యవాచకర్



భద్రాద్రి రాముడు కంచర్ల గోపన్నను కారాగారం నుండి విడిపించేందుకు దివినుండి భువికి దిగివచ్చాడు. భక్త శిఖామణియైన మాణిక్యవాచకర్ విషయంలోనూ ఈశ్వరుడు ఆమాదిరిగానే అనుగ్రహించాడు.

క్రీ.శ. 4వ శతాబ్దిలో అరి మధన పాండ్యుడు మధుర రాజధానిగా రాజ్యపాలన చేస్తున్నాడు.

వేగై నదీ తీరాన తిరువడపూర్‌లో తిరువడ వూరర్ అనే బ్రాహ్మణ బాలుడు పదహారేళ్ళకే వేదవేదాంగాలు పూర్తి చేశాడని రాజు విన్నాడు. వెంటనే అతణ్ణి పిలిపించి తన ప్రధాన మంత్రిగా చేశాడు. తెన్నావరం బ్రాహ్మణరాయ్ అని అతనిని పిలిచేవారు. కొంత కాలానికి మంత్రాంగములో తిరువడ వూరర్‌కు మొహం మొత్తింది. శివ పంచాక్షరి మంత్రం మహాత్యం వివరించగల మహా పురుషుని కోసం అతను అన్వేషించ సాగాడు.

ఇలా వుండగా తిరుపందరూరుకు చక్కని గుర్రాలు వచ్చాయని రాజుకు తెలిసింది. వాటిని కొనుక్కురమ్మని తన మంత్రిని పంపాడు.

బ్రాహ్మణ రాయన్ అశ్వాల కోసం పయనం కట్టాడు. త్రోవలో ఒక జ్ఞాని శిష్యులతో ఒక చెట్టు క్రింద వుండటం ఆయన కంట బడినది.

శివుడే ప్రమధ గణాలతో అక్కడ కొలువు తీరినట్లు అతనికి అనిపించింది.

ప్రధాన మంత్రి తాను వెడుతున్న పని మరచి పోయాడు.

జ్ఞాని వేషంలో ఉన్న మహా దేవుణ్ణి శరణు వేడాడు. ఎన్నో మధుర గీతాలు పాడాడు. ఆయన వాక్కులు మణులు మాదిరిగా వున్నాయి. అప్పటి నుండి ఆయన మాణిక్యావాచకర్ అయినాడు.

గుఱ్ఱాలు కొనమని రాజు ఇచ్చిన సొమ్మంతా మాణిక్య వాచకర్ ఇచ్చివేశాడు. తమ మంత్రి చేసిన పని రాజుకు తెలిసింది. వెంటనే పిలిపించి "గుఱ్ఱాలు ఏవ"ని గద్దించాడు. త్వరలో వస్తాయని మంత్రి చెప్పాడు.

కొంతకాలం వేచివుండి రాజు మంత్రి గుర్రాల సంగతి అడిగాడు. అతడు ఏమీ బదులు చెప్పలేక పోయాడు. రాజు మంత్రిని చెరసాలలో బంధించమన్నాడు. ఖైదులో మహాశివుణ్ణి వేనోళ్ళ కీర్తించాడు మాణిక్యావాచకర్.

అతని భక్తికి మెచ్చి సదాశివుడు అడవిలోని గుంటనక్కలను గుర్రాలుగా మార్చి రాజు వద్దకు పంపాడు. మాణిక్యావాచకర్ విముక్తుడైనాడు.

కానీ అర్ధరాత్రి వేళకు గుర్రాలన్నీ తిరిగి గుంటనక్కలుగా మారి పోయినవి.

రాజు మాణిక్యావాచకర్‌ను పిలిచి అసలు విషయం చెప్పమన్నాడు. మంత్రి శివుణ్ణి ప్రార్థించాడు. పరమేశ్వరుడు ఉగ్రుడైనాడు. వేగైనది పొంగి పారింది. వరదలలో మధురాపురి మునిగి పోయింది.

రాజు తన తప్పు తెలిసికొన్నాడు. తనను మన్నించమని మాణిక్యావాచకర్‌ను ప్రార్థించాడు.

శివుని ఆజ్ఞ మేరకు మాణిక్య వాచకర్ దేశమంతటా తిరిగాడు. చిట్ట చివరకు చిదంబరం చేరాడు.

ఒక ముసలి బ్రాహ్మణుడు అతని దగ్గిరిచేరి నీ పాటలన్నీ వ్రాసుకోవాలని వచ్చాను. నెమ్మదిగా చెప్తే వ్రాసుకుంటాను అన్నాడు.

మాణిక్యావాచకర్ సరే అన్నాడు. ఆ పాటలన్నీ వ్రాసుకుని బ్రాహ్మణుడు చివరగా చేవ్రాలు కూడా చేశాడు.

మరలా ఆ ప్రాంతంలో ఆ ముసలి బాపడు కన్పించలేదు. మర్నాడు చిదంబరం ఆలయ అర్చకులు ఎప్పటి మాదిరే ఉదయానే తలుపులు తెరిచారు.

ఆశ్చర్యం! మాణిక్యావాచకర్ పాటలన్నీ-వెయ్యి పాటలూ ఒక్క అక్షరం తేడా లేకుండా స్వామి ముందు పెట్టి వున్న గ్రంథంలో కన్పించాయి.

చిదంబరం అర్చకులు ఇందులో గల రహస్యం ఏమని మాణిక్యావాచకర్‌ను ప్రశ్నించారు.

అన్నిటికి "సభాపతి" ఆయనే అంటూ చిదంబరేశ్వరుణ్ణి చూపాడు మాణిక్యావాచకర్.

ఈ మాటలు చెప్తూ తాను స్వామి విగ్రహంలో మాయమయ్యాడు.

మాణిక్యవాచకర్ గీతాలన్నీ ఉన్న గ్రంథమే "తిరువాచకం".

రమణ భగవాన్ జన్మించిన "తిరుచ్చుళి" ప్రసిద్ధ పుణ్య క్షేత్రం. ఆ పట్టణ గొప్పధనాన్ని మాణిక్యవాచకర్ ఇలా వ్రాశాడు.

**ప్రేమ మృదుల హృదయ ప్రియ విహ్వాలింప**

**బయల జంగాల గలయుచు భవుడు వారి**

**ఁదుస్థు లందూరి యందంత యమృత మూర**

**నచల తాండవమాడును, అచ్చటి హంస**

**కొమ్మమది గుందరగ వేది కూర్కు ఁగరిన**

**యగు జలం చలి; క్షేత్ర మహిత్వ మదియ**

**అట్టి వయలూర్ తిరుచ్చుళి యందు శివుడు**

**మేర మీటి చరింప విడ్డూరమేమి--**

(తేనుగుసేత - రామచంద్ర కౌండిన్య)

"తిరు వాచకం కాకపోతే మరేది హృదయాన్ని కదలించలేదు" అన్నది తమిళదేశంలో తరచూ వినబడే నానుడి.

ప్రఖ్యాత భక్తుడు మహాకవి అయిన మాణిక్యావాచకర్ ఆదిశంకరుల వలె ముప్పది రెండేళ్ళు మాత్రమే జీవించాడు.

తిరువాచకంలో "తందమన్

"తన్నై కొండదెన్ తన్నై" అనే పాటలోని భావం ఇలావుంది. నాచిత్తమే కోవెలగా చేసుకున్న నాదైవమా తిరుప్పెందురై పరమేశ్వరా నిన్ను నాకిచ్చి అందుకు ప్రతిగా నన్ను నీవు తీసుకున్నావు. శంకరా మన ఇద్దరిలో చతురులు ఎవరు?

అప్పర్ దాస భావం కాగా మాణిక్యవాచకరులది నాయికా భావం.



# జ్ఞాన సంబందర్



క్రీ.శ. 6వ శతాబ్దంలో మధుర నేలిన పాండ్య రాజుకు జైన మతం అంటే వల్ల మాలిన అభిమానం. కానీ, ఆయన భార్య చోళరాజు కుమార్తెకు మాత్రం శైవం అభిమాన మతం.

వాదంలో జైనాన్ని ఎవరు ఖండించ శక్తి కలవారు అన్న ప్రశ్న వచ్చింది. సంబంధర్ అందుకు తగినవాడని మహారాణికి తెలియ వచ్చింది. వెంటనే అతణ్ణి తమ రాజధానికి పిలువనంపింది. తీరా సంబంధర్ మధురకు వచ్చాక చూస్తే అతనికి పట్టుమని పన్నెండళ్ళు లేవు. కొమ్ములు తిరిగిన జైన పండితులతో ఇతడేమి తలపడ గలడన్న అపనమ్మకం ఆమెకు కలిగింది.

జ్ఞానియైన సంబంధర్ మహారాణి సందేహం కనుగొన్నాడు. కొన్ని భక్తి గీతాలు పాడాడు. ఒక గీతంలో ఈ మాదిరి అన్నాడు. "భగవంతుడు నాలోనే వున్నాడు" దీనితో మహారాణికి గల అపనమ్మకం తొలగి పోయింది.

సంబంధర్ మధురలో బస చేసిన విడిదికై జైనులు కక్షతో నిప్పు అంటించాడు. అప్పుడు ఆయన ఒక గీతం ఇలా ఆలాపించాడు.

"జైనులు వెలిగించిన అంగారకుడు రాజును చేరుగాక" అని. అతని ప్రార్థన ఫలించింది. పాండ్యరాజుకు జ్వరం పట్టుకొని నానాటికి ఎక్కువయింది. జైనులు ఎన్ని మంత్ర తంత్రాలు చేసినా రాజుకు జ్వరం ఏమాత్రం తగ్గలేదు.

సంబంధర్ సంగతి చెప్పి రాజును పప్పించాడు మంత్రి. జైనులకు సంబంధర్‌కు రాజును కాపాడిన కీర్తి రావడం ఇష్టం లేక పోయింది.

రాజుగారికి కుడి ప్రక్క సంబంధర్, ఎడమ వైపు జైనులు చేరారు. ముందుగా జైనులు తన మంత్ర శక్తిని ప్రయోగించారు. ఎడమవైపు వ్యాధి ఎక్కువైంది. సంబంధర్ శివుణ్ణి స్తుతించారు. రాజు కుడివైపు బాధ తగ్గింది. ఎడమ వైపు భరింపరాని విధముగా మారింది.

రాజు జైనులు ఓడి పోయినట్లు ప్రకటించారు. సంబంధర్ శరీరం అంతా విభూతి పట్టించి రాజును పూర్తి ఆరోగ్యవంతుణ్ణి చేశాడు. మరో రెండు పరీక్షలలో కూడా సంబంధరే నెగ్గుతూ వచ్చాడు.

శీర్కాళి పట్టణంలో సాంప్రదాయకమైన బ్రాహ్మణ కుటుంబంలో సంబంధర్ జన్మించాడు. తండ్రి శివపాద హృదయార్. తల్లి భగవతియార్. సంబంధర్ మొదటి పేరు అళూదయ పిళ్లైయార్.

అతనికి మూడేండ్ల వయసున్నప్పుడు, షియాల్ లోని గుడికి తండ్రి తీసుకొని వెళ్ళాడు. అక్కడ కోనేటి గట్టున, పిల్లవాణ్ణి వుంచి తండ్రి స్నానం చేసేందుకు నీటిలో దిగాడు. నీటిలో మునిగి స్నానం చేస్తున్న తండ్రి కన్పించక పిల్లవాడు పెద్దగా ఏడ్వ సాగాడు.

పార్వతీ పరమేశ్వరులు ఆ ప్రాంతంలో విహరిస్తూ ఏడ్చే బాలుణ్ణి చూచారు.

శివుని ఆజ్ఞ మేరకు పిల్లవానికి పార్వతీదేవి పాలు పట్టింది. అవి త్రాగి పిల్లవాడు ఏడ్పు మానివేశాడు.

తండ్రి స్నానం చేసి వచ్చి పిల్లవాణ్ణి చూచాడు. పిల్లవాని పెదాలకు పాలు త్రాగిన గుర్తులు చూసి ఆశ్చర్యపోయాడు. తండ్రి దండిస్తే జరిగింది చెప్పాడు బాలుడు.

ఇలా పాడాడు.

"కుండ లాల చెవి వాడు
వృషభ వాహన మెక్కిన వాడు
తెల్లని చంద్రుడు తలపై నున్నవాడు
వల్ల కాటి భస్మమును పూసిన వాడు
నా హృదయమును హరించిన దొంగ
నా తండ్రి అడుగో"

ఈ పాట విని తన బిడ్డకు పార్వతీ పరమేశ్వరుల అనుగ్రహం లభించినందుకు పొంగిపోయాడు శివపాద హృదయార్.

16వ ఏట సంబంధర్‌కు పెండ్లి అయింది. నూతన వధూవరులు బంధువులతో పాటు ఆ ఊరి గుడికి వెళ్ళారు. బంధు జనానికి గుడి కన్పించలేదు. ఆ స్థానంలో ఒక పెద్ద జ్యోతి కన్పించింది. ఆ కాంతి పుంజములో ఒక చిన్నదారి కన్పించింది.

సంబంధర్ అనేక క్షేత్రాలు దర్శిస్తూ మోరన్ వాడి అనే దివ్యక్షేత్రం చేరుతాడు.

బాల భక్తుడు కాలినడక పయనిస్తుండటము చూచి భగవానుని జాలి వేసింది.

ముత్యాల పల్లకీ, ఇతర వస్తువులు ఆలయములో ఆవిర్భవించాయి. స్వామి అర్చకులకు కలలో కన్పించి వాటిని సంబంధర్‌కు అందజేయ మన్నాడు.

సంబంధర్ అరయ నల్లూరు క్షేత్రంలో వుండగా అరుణాచలేశ్వరుడు ముసలి బ్రాహ్మణ రూపంలో అతనికి దర్శన మిస్తాడు. తానొక అరుణాచలేశ్వరుని అర్చకునిగా చెప్పుకుంటాడు.

తన అనుచరులతో అరుణగిరి చేరి ఈశ్వరుణ్ణి సేవిస్తాడు సంబంధర్.

దారి మధ్యలో తన ముత్యాల పల్లకీని, ఇతర విలువగల వస్తువులను దొంగలు కొల్లగొట్టారు.

"ఇదంతా ఏమిటి" అని ముసలి బ్రాహ్మణ్ణి సంబంధర్ అడిగాడు.

దొంగలు ఈశ్వర భక్తులైన ప్రమధ గణాలు. అరుణాచల క్షేత్రంలో అట్టహాసాలకు తావుండరాదని చెప్పటానికి ఇలా జరిగిందని ఆయన చెప్పాడు.

జ్ఞాన సంబంధర్‌కు అప్పర్ అనే మరొక భక్తుడు తోడైనాడు. వారిద్దరు అనేక పుణ్యక్షేత్రాలు దర్శించి భక్తి గీతాలు ఆలపిస్తారు.

సంబంధర్ తన గీతాలలో భగవంతుని తండ్రిగా భావించి కీర్తించాడు.



# సుందరమూర్తి



శ్రీకృష్ణ భగవానుడు తన విశ్వరూపాన్ని చూపించినపుడు అర్జునుడు ఆశ్చర్యపోయాడు. "స్వామీ నీ గురించి పూర్తిగా నాకు తెలియక పోవడం వల్ల ఓయ్ కృష్ణా! ఏమోయ్ యాదవా! ఓయీ సఖా! అని యింతవరకూ పిలుస్తూ వచ్చాను. నా తప్పు క్షమించమని ప్రార్థన" అని వేడుకున్నాడు.

ఈశ్వరునితో అలాంటి స్నేహభావంతో మెలగిన మహనీయుడు సుందరమూర్తి.

చోళదేశానికి తొండై మండలానికి మధ్య వుండే ప్రదేశాన్ని ఎనిమిదవ శతాబ్దంలో తిరుమనై పాడినాడుగా పిలువబడింది. అది శైవ బ్రాహ్మణ కుటుంబంలో సుందరమూర్తి జన్మించాడు. తండ్రి చడయనారు, తల్లి ఇశైజ్ఞానియారు.

పూర్వ జన్మలో సుందరమూర్తి ఈశ్వరుని సేవకుడు. కైలాసంలో హాలాహల సుందరుడను పేరుతో ఈశ్వరుని సేవిస్తూ వుండేవాడు.

పార్వతీదేవి సేవకురాండ్రయిన కమలిని, అనిదిత ల ప్రేమలో సుందరమూర్తి పడినాడు. ఫలితంగా వారందరూ భూలోకంలో మానవావతారాలు ఎత్తినారు.

అందమైన రూపం కారణంగా అతనికి "సుందరమూర్తి" అను పేరు స్థిరకమైనది.

బాల్యంలో వీధి బొమ్మ బండితో ఆడుకొంటున్న సుందర మూర్తిని చూచి రాజబంధువు ముచ్చటపడినారు. తల్లిదండ్రుల అనుమతితో అతణ్ణి తీసుకొని వెళ్ళి

తన వద్ద పెంచసాగాడు.

రాజమందిరాలలో పెరిగినా అతనికి బ్రాహ్మణ సాంప్రదాయాలలోనే శిక్షణ యివ్వబడింది. యుక్తవయస్సు రాగానే అతనికి పెండ్లి నిశ్చయమయింది.

వధువు పుత్తూరుకు చెందిన చటంగవి శివాచార్య కుమార్తె.

వివాహానికి వరుడు గుర్రం మీద తన స్వగ్రామం నావలూరు నుండి పుత్తూరుకు బంధువర్గంతో తరలి వచ్చారు.

వివాహానికి ముందు జరుగవలసిన తతంగం జరుగుతూ వున్నది. ఇంతలో ఒక ముసలి బ్రాహ్మణుడు వచ్చి "ఆపండి" అనే సరికి పెండ్లి వారంతా నివ్వెర పోతారు.

"ఈ వరుని తాత నాకు ఒక బాండు వ్రాసి ఇచ్చినాడు. దాని ప్రకారం ఇతడు నా సేవకుడు" అన్నాడు ముసలి బాపడు.

సుందరమూర్తి ఉగ్రుడై పోయాడు.

ఒక బ్రాహ్మణుడికి మరొక బ్రాహ్మణుడు సేవకు డెట్లా అవుతాడు? సుందరమూర్తి ప్రశ్న.

ముసలి బాపడు ఒక దస్తావేజు తీసి చూపించాడు. తన వంశం వాండ్లంతా అతణ్ణి సేవించాలని సుందరమూర్తి తాత వ్రాసినట్లు దానిలో వున్నది.

సుందరమూర్తి "అది దొంగ దస్తావేజు" అంటూ తాత దగ్గర నుండి లాగుకొని చించి వేశాడు

పెండ్లివారు "అది సరే! ఇంతకూ మీది అసలు ఏ ఊరు?" అని ప్రశ్నించారు.

తనది నల్లూరు అని ముసలి బాపడు బదులు చెప్పాడు.

సుందరమూర్తి "ఆ వూరే వెళ్ళి విషయం తేలుస్తాం" అని పెండ్లి వారిని బయలు దేరదీసినాడు.

నల్లూరు బ్రాహ్మణ సంఘంలో చర్చ ఏర్పాటు చేశాడు ముసలి బ్రాహ్మణుడు.

"సుందరమూర్తి చించివేసినది దస్తావేజు నకలు మాత్రమే ననీ అసలు దస్తావేజులు తన దగ్గర వుందం"టూ సంఘం వారి ముందువుంచాడు.

"నిజమే! ఇందులో వున్నది ఇతని తాత సంతకమేన"ని బ్రాహ్మణ సంఘములో ముసలి బ్రాహ్మలు చెప్పారు.

సుందరమూర్తి గత్యంతరములేక ముసలి బాపడికి బానిస అయినాడు.

"మీ యిల్లు ఎక్కడ? ఈ ఊళ్ళో ఎప్పుడూ చూడలేదే!" అని అక్కడి వారు ముసలి బ్రాహ్మణ్ణి ప్రశ్నించారు.

"నాతో రండి అంటూ తిరువరుశౌతుర్రై గుడికి వారందరినీ తీసుకొని వెళ్ళి అదృశ్యుడైనాడు బ్రాహ్మణుడు.

అందరినీ బయటనే వుండమని సుందరమూర్తి ఒకడే ఆలయంలోనికి వెళ్ళాడు.

సుందరమూర్తికి పార్వతీ పరమేశ్వరులు సాక్షాత్కరించారు.

ఈశ్వరుడు "ఏమోయ్! నాతోనే జగడం వేసుకున్నావే, ఈ దినం నుండి నిన్ను 'వన్ తొండన్' అని పిలుస్తారు జనమంతా. నీ పని ఏమీలేదు నా మీద పాటలు వ్రాసి పాడడమే అన్నాడు".

ఎలా మొదలు పెట్టాలన్నాడు? సుందరమూర్తి. ఏముంది? ముందే నన్ను పిత్త (పిచ్చి) అన్నావుగా, అలాగే పాడు. అని శివుడు ఆజ్ఞ ఇచ్చాడు.

సుందరమూర్తి అలాగే చేశాడు. అతడి మొదట "పిత్తా పిరై చూడి".

సుందరమూర్తి వివాహం చేసుకోవలసిన వధువు కన్యగానే వుండి పోయినది. తరువాత కొంతకాలానికి తీరి పోయింది.

మహాభక్తుడైన సుందరమూర్తి నావలూరు వచ్చి ఈశ్వరుణ్ణి పూజించసాగాడు.

చిదంబరం దర్శించాలని అతని కోరిక కలిగింది. మార్గమధ్యంలో 'తిరువాడిగై' ఒక మజిలీ. జైనం నుండి శైవంలోనికి అప్పర్ రావడం జరిగింది ఈ వూరిలోనే.

ఆ వూరిలోకి పోయి పవిత్రతకు భంగం కలిగించ కూడదని సుందరమూర్తి ఆ రాత్రి ఒక మఠంలో పండుకొన్నాడు ఒక రాత్రివేళ మెలకువ వచ్చి చూసే సరికి తన నెత్తిన ఒక ముసలి బ్రాహ్మణుడు కాళ్ళుపెట్టి పండుకొని వున్నాడు.

సుందరమూర్తి "ఎవరు నువ్వు?" అని అడుగగా నన్నే ఎరుగవా! అని అతడు అదృశ్యుడైనాడు.

అతడు ఈశ్వరుడు కాక మరొకరు కాదని తెలిసి కొన్న సుందరమూర్తి చిదంబరం వెళ్ళి స్వామిని కొంతకాలం సేవించాడు. అక్కడి నుండి తిరువారు వెళ్ళాడు. తిరువూరు స్వామి పేరు "నంబియారుర్". ఆ స్వామి సుందరమూర్తి వంశం వారి ఇలవేల్పు. సుందరమూర్తికి ఆ స్వామి పేరనే బాల్యంలో నామ కరణం జరిగినది కూడా.

కైలాసంలో సుందరమూర్తి ప్రేమలో పడిన కమలిని ఈ ఊరిలో జన్మించి "పరవయ్యార్" పేరుతో పెరిగింది.

సుందరమూర్తి ఆమెతో వివాహం అయ్యేటట్లు చూడమని ఈశ్వరుణ్ణి కోరాడు.

ఆ స్వామి భక్తులకు కలలో కన్పించి సుందరమూర్తికి పరవయ్యార్‌కి వివాహం అయ్యేట్లు చేశాడు.

గృహస్థుడు అయిన సుందరమూర్తి ప్రతి దినమూ శివాలయమునకు వెళ్ళి ఈశ్వరుణ్ణి సేవించ సాగాడు.

ఈశ్వరుడు భక్త బృందంతో దర్శన మిచ్చి "వీరందరినీ నా పాటలో కీర్తించు' ' అని సుందరమూర్తిని ఆదేశిస్తాడు.

ఎలా మొదలు పెట్టాలి? అని సుందరమూర్తి ప్రశ్న.

"చిదంబరంలో వుండే భక్తుల సేవకుణ్ణి నేను" అని మొదలు పెట్టమన్నాడు. సుందరమూర్తి దానిని అందుకొని అరవై ముగ్గురు భక్తులను స్తుతిస్తూ గీతం ఆలపించాడు.

తిరువారూరులో స్వామికి కల్యాణోత్సవం జరిగే సమయం వచ్చింది. పరవైయార్‌కు ధనం కావలసి వచ్చింది.

సుందరమూర్తి తిరుప్పగళూరు వెళ్ళి డబ్బు కావాలని ఈశ్వరుణ్ణి ప్రార్థించసాగాడు. పడికం పాడిస్తోత్రం చేసిన ఫలించలేదు. విసుగెత్తి సుందరమూర్తి సమీపంలోని మఠంలో ఇటికలు తలనిండు పేర్చుకొని నిద్రించాడు. మెలకువ వచ్చిన తరువాత చూస్తే ఇటికలన్నీ బంగారంగా మారిపోయినవి. వాటితో తిరువారూరు వెళ్ళి ఉత్సవం దర్శించేందుకు వచ్చిన భక్తులకు ఉపచరించేందుకు వినియోగించాడు.

అనేక దివ్యక్షేత్రాలు దర్శిస్తూ సుందరమూర్తి తిరుమూడుకున్రు వెళ్ళాడు. స్వామిని పన్నెండు వేల బంగారు నాణేల కోసం ప్రార్థించి వాటిని తిరువారూరు చేర్చమన్నాడు.

స్వామి అక్కడి నదిలో నాణాలను పారవేసి తిరువారూరు కొలనులో ఏరు కొమ్మన్నాడు.

సుందరమూర్తి యాత్ర మార్గంలో తిరువర్రియూరు చేరుతాడు. శాపతప్త అయిన పార్వతి సేవకురాలు "అనిందిత" సాంగిలియార్ పేరట ఒక రైతు బిడ్డగా పెరుగుతూ వుంటుంది.

ఈశ్వర భక్తురాలైన సాంగిలియార్ స్వామికి వలసిన పూలమాలలు కడుతూ అనుదినమూ సేవిస్తూ వుండేది. సుందరమూర్తి అక్కడ తటస్థ పడగా వెంటనే జన్మాంతర ప్రేమికులు ప్రేమలో పడతారు.

సుందరమూర్తికి స్వామి పట్ల సఖ్య భావం కనుక స్వామిని తమ వివాహం కోసం ప్రార్థిస్తాడు. వారి కోరిక తక్షణం అంగీకరింపబడింది.

సుందరమూర్తి కాలంలో నివసించిన "కలిక్కమార్" చేరమాన్, పెరుమాళ్‌లతో సుందరమూర్తికి స్నేహ భావం కుదిరింది.

పెరుమాళ్‌తో కలసి పశ్చిమ తీరానగల "తిరుక్కుండియార్"కు సుందరమూర్తి ప్రయాణం కట్టాడు. విపరీతమైన వరదల మూలంగా కావేరీ నదిపై నడిపే పడవల ప్రయాణం ఆగిపోయింది.

మహాభక్తుడైన సుందరర్ ఒక 'పడికం' పాడగానే కావేరీ ఆ భక్తులకు త్రోవ నిచ్చింది. చేరరాజు సుందరమూర్తిని మిక్కిలి ఆదరించాడు.

సుందరమూర్తి కొంగు మండలంలో మొసలి బారినుండి ఒక పిల్లవాణ్ణి రక్షిస్తాడు.

కొంతకాలానికి సుందరమూర్తి 'తిరువాయికయిక్కం'లో ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తూ స్వామి పంపిన తెల్ల ఏనుగుపై కైలాసం చేరుకుంటాడు.

ఈశ్వరుడు సుందరునితో సఖ్య భావంతో అనుగ్రహించినా గర్వించక దేవదేవుని పట్ల వినయమే ప్రదర్శించాడు.

సుందరమూర్తి 38 వేల కీర్తనలు పాడినట్లు ..... కానీ ఈనాడు నూరు కీర్తనలు మాత్రమే కన్పిస్తున్నవి.



# నందనారు



మహాశివరాత్రి పుణ్యదినమది. పుణ్యక్షేత్ర మయిన తిరుప్పంగూరులో ప్రజలు గుంపులు గుంపులుగా చేరి విడ్డూరంగా చెప్పకోసాగారు.

అక్కడి ప్రాంత సంకేశ్వరాలయంలో గర్భగుడికి ఎదురుగా వుండే నందీశ్వరుని విగ్రహం చూస్తూ చూస్తూ వుండగానే భూమి లోపలకి చొచ్చుకు పోయి అదృశ్య మయిందట. అంతేకాదు. అక్కడి సమీపంలోనే మధురమైన నీరు పొర్లివస్తూ క్షణాల మీద ఊట బావి ఏర్పడిందట.

ఆశ్చర్య కరమైన విషయే మేమంటే అంటరానివాడైన 'నందనారు' అనే భక్తుడు ఈ రెండు వింతలకు కారకుడని ఔను... నిజమే... ఈశ్వరునికి కులముతో పని ఏముంది?

నిశ్చలమైన భక్తి ఎవరికి వుంటుందో వాడే ఈశ్వరునికి బంధువు. శివ దీక్షా పరులకు కులం పేరిట ఆటంకం కలిగించే వారే "అంటరానివారు".

వైఘు, తామ్ర పర్ణినదుల మధ్య స్థలమైన దేశాన్ని 'మేల్కానాడు' అని పిలుస్తారు.

"ఆదనూరు" మేల్కానాడు భాగంలోని ఒక్కపల్లె.

గ్రామీణ ప్రజలందరికీ వ్యవసాయమే ప్రధాన వృత్తి. గ్రామంలో పెద్ద భూస్వామి మాధవ నాయర్. అతని భార్య చారుమతి.

నాయర్ కుటుంబానికి "నందనార్" వ్యవసాయకూలి.

గ్రామాన్ని అనుకునే మాలపల్లి వున్నది. నందనార్ ఇల్లు పల్లెలో

మొట్టమొదటిది. పూర్వజన్మ సంస్కారం వల్ల నందనార్‌కు గాఢమైన శివభక్తి పట్టుబడింది.

ఎల్ల వేళలా శివ నామాన్ని స్మరిస్తూ తన పనులు చేసికుంటూ వుండేవాడు.

నందనారు భార్య పేరు తందె. ఆమె గూడ భర్త అడుగుజాడలలో నడుస్తూ వుండేది.

తన గూడెంవారిలో అనేకమార్పులు రావడానికి నందనారు కారకుడయినారు. అంతకు పూర్వం 'జాతర'లో విశేషంగా జంతు బలిసాగెడిది. సాత్విక చింతనగల నందనారు తనవారికి నచ్చజెప్పి "జంతు బలికి అర్థం లేదని" వివరించి మాన్పించాడు.

కులవృత్తిని మాత్రం అతడు మానలేదు. దేవాలయాలలో భజనకు ఉపయోగపడే మృదంగ వాద్యాలకు కావలసిన చర్మాలను సేకరించి మేళ గాండ్రకు అందజేసెడి వాడు.

నందనారు మాధవ నాయర్ ఇంట వ్యవసాయ కూలిగా వెట్టి చాకిరి చేయవలసి వచ్చెడిది.

నాయర్ భార్య చారుమతి గయ్యాళి. మాటి మాటిమాటికి నందనారు భక్తిని అంటరాని తనాన్ని ఎత్తి చూపి అనందించేది.

నందనారు ఆమె "దురుసుతనాన్ని" లక్ష్యపెట్టక తన పనితాను చేసుకొని వెళ్ళుచుండేవాడు.

తిరుప్పంగూరులో ఈశ్వరుడు నందిని అడ్డు తొలగించి తనకు దర్శనం కలిగించిన నాటినుండి నందనారుకు చిదంబరేశ్వరుణ్ణి చూడాలని కోరిక కలిగింది.

తపో నిమగ్నమయిన పార్వతికి శివుడు "ఆనంద నృత్యం" ప్రదర్శించిన దివ్యస్థలమే చిదంబరం. అక్కడే శివుని ఢమరకం నుండి పదునాలుగు స్వరములు ఉద్భవిల్లి మహేశ్వర సూత్రములయినవి.

రేపు పోవుదును. రేపు పోవుదును అని తలపోసెడివాడు అందుచే అతనికి "తిరునాళై పోవర్" అని జనులు పిలువసాగారు.

చిదంబరంలో అయిదు రోజుల పాటు శివరాత్రి మహోత్సవంగా జరుగుతుంది.

అది చూడవలెనని అతనికి తలంపు కలిగి తన యజమానులైన నాయర్‌ల వద్ద శలవు కోరాడు.

నాయర్ భార్య చారుమతి వెంటనే అంగీకరించక తమ పొలంలో నాట్లు పూర్తి చేయించి వెళ్ళవలసిందని పట్టుబట్టినది.

సాధారణంగా అది నాల్గు రోజుల పని. నందనారు మరునాడే ప్రయాణం తలపెట్టి వుండినాడు.

నిశ్చలమైన భక్తితో నందనారు "సరే" అని వారి మాటనే కానివ్వమని నాడు.

నందనార్ తన భార్యకు చెప్పి రాత్రికి రాత్రి నాయర్ పొలము వెళ్ళి శివధ్యానంతో నాట్లు పని ప్రారంభించాడు.

ఎక్కడ నుండి వచ్చిరో తెలియదు.

పలువురు కూలీలు అతనికి తోడ్పడినారు.

తెల్లవారు సరికి యజమాని పొలమంతటా నాట్లు వేయబడినవి. నందనారుకే ఆశ్చర్యమయినది.

యజమాని నందనారు పని ఎంత వరకూ ముగిసినది తెలియగోరి పొలము చేరుకుని చూచేసరికి మూర్ఛ వచ్చినంత పని అయినది.

ఇది నిశ్చయముగా దైవకృత్యమే!

ఒక్క మానవునకిది అసాధ్యమని నందనార్ భగవద్భక్తికి మెచ్చి చిదంబరం వెళ్ళవలసినదిగా శలవు యిచ్చాడు.

నందనార్ హృదయం పొంగి పొరలినది. ఇంటికి వెళ్ళి జరిగినదంతయూ భార్యకు చెప్పి చిదంబరం పయనం కట్టినాడు.

చిదంబరం ప్రాకారములు దర్శించగనే "నా తండ్రి నటరాజు ఆనంద తాండవమాడు కనక సభ ప్రవేశించు అర్హతనాకు లేకపోయెనే" అని నందనారు బాధపడ సాగెను.

నాటి రాత్రి నందనారుకు ఈశ్వరుడు కలలో కన్పించి జన్మ దోషం హరించుటకు అగ్ని ప్రవేశం కల్పించానని వివరిస్తాడు.

చిదంబర ఆలయ ప్రధాన అర్చకునికి స్వామి కలలో కన్పించి దక్షిణ ద్వారము కడ పరుండిన "నందనార"నే నాభక్తకునికి చితి ఏర్పరిచి నా సన్నిధికి చేర్చమని ఆదేశించారు.

మరునాడు ఉదయమే చిదంబర దీక్షిత స్వామి మేల్కొని భగవద్వాణి తెలిపారు.

నందనారు పరమానందం చెంది దీక్షితులు ఏర్పరచిన అగ్ని ప్రవేశం చేశాడు.

దివ్య కాంతులతో నందనారు చితి నుండి వెలికి వచ్చారు. పలువురు బ్రాహ్మణులతనికి సాష్టాంగా పడినారు. వారు నందనారును నటరాజ దర్శనమునకు కొనిపోవు చుండిరి. కనక సభ మందిరం చేరుకునే సరికి నందనారు అదృశ్యుడై చిదంబరేశ్వరునిలో లీనమయినాడు.

నందనారు చరిత్ర భగవద్భక్తికి కులంతో పని లేదని నిరూపించుచున్నది.

# నమ్మాళ్వార్



**త**మిళదేశంలో భక్తి ఉద్యమాన్ని పతాక స్థాయికి చేర్చిన వారు వైష్ణవ ఆళ్వారులు. శైవనాయనార్లు.

భగవానుని గుణగానంతో తన్మయుడై వుండే వాడే ఆళ్వారు. పన్నెండు మంది ఆళ్వారులలో నమ్మాళ్వార్ అత్యంత ప్రముఖుడు. నమ్మ - ఆళ్వారు అంటే మా ఆళ్వారు అని అర్థం.

తామ్రపర్ణీ నదీ తీరంలో తిరుక్కురుగూర్‌లో కారియర్. ఉడైనాంగి యార్ దంపతులకు వర ప్రసాదంగా నమ్మాళ్వారు జన్మించాడు.

"మారన్" అని శఠగోపుడని కూడా ఇతనికి పేర్లు.

బాల్యంలో ఇతరులకంటే భిన్నంగా వుండుటచేత 'మారన్' (భిన్నుడని అర్థం) అనే పేరు వచ్చింది.

తల్లి గర్భంలో శఠ మనేవాయువు బిడ్డను కప్పి వేస్తుంది. కానీ నమ్మాళ్వారు గర్భంలో వుండగా శఠ వాయువును హుంకారముతో తన దరికి రాకుండా చేశాడు. ఈ కారణంచేత అతడికి శఠగోపుడని పిలుస్తున్నారు.

నమ్మాళ్వారు రచనలను మెచ్చి అది నాథస్వామి వకుళమాలను అతనికి యిచ్చినందున వకుళాభరణుడని పేరు వచ్చింది.

నమ్మాళ్వారు పుట్టినది మొదలు ఎలాంటి చలనం కానీ ఏడ్వడం కానీ చేయలేదు. తల్లి దండ్రులు మిక్కిలి దుఃఖించారు.

ఒక బంగారు ఉయ్యాలలో తమ బిడ్డను వుంచి అక్కడి దేవాలయం సమీపంలోని చింతచెట్టు వద్ద దిగవిడచి వెళ్ళారు.

పదహారేళ్ళ ప్రాయం దాకా నమ్మాళ్వారు అలాగే ధ్యానంలో వున్నాడు.

మధుర కవి అనే పుణ్యశాలి దేశం అంతటా పుణ్యతీర్థాలు సేవిస్తూ అయోధ్య చేరాడు. అక్కడ అతనికి ఒక దివ్యజ్యోతి కనిపించింది. ఆ జ్యోతి కన్పించిన దిక్కుగా అతడు పయనమయ్యాడు.

సమాధి స్థితిలో వున్న నమ్మాళ్వారు చెంతకు చేరగానే జ్యోతి అదృశ్యమైంది.

నమ్మాళ్వార్ దృష్టిని ఆకర్షించేందుకు మధురకవి చప్పుడు చేశాడు.

నమ్మాళ్వారు ధ్యానం నుండి మేల్కొని కళ్ళు తెరిచాడు.

మధురకవి "చనిపోయినదాని నుండి సూక్ష్మం పుట్టి ఏమి తింటుంది? ఎక్కడ వాసం చేస్తుంది?" అని ప్రశ్నించాడు.

"దానినే తింటూ అక్కడే పడి వుంటుందని" నమ్మాళ్వారు నోటివెంట సమాధానం వెలువెడింది.

"దానితో ముగ్ధుడైన మధురకవి అతని శరణు వేడి శిష్యుడైనాడు.

"నమ్మాళ్వారే నాకు దేవుడు" అని ఆయన చెప్పేడు.

ఆళ్వారుల దివ్య ప్రబంధాలుగా పేర్కొన్న వాటిలో నమ్మాళ్వారు రచించిన తిరువిరుత్తం, తిరువాశిరియం, పెరియతిరువందాది, తిరువాయ్ మొళికూడా వున్నాయి.

భగవద్రామానుజులు తమ శ్రీభాష్యంలో నమ్మాళ్వారును ప్రస్తావిస్తారు. అందుచేత నమ్మాళ్వారు వైష్ణవ కులపతిగానూ, ఆయన రచనలు తమిళ వేదాలు గానూ ప్రసిద్ధి వహించాయి.

రామానుజు లొకసారి నమ్మాళ్వారు పుట్టిన గ్రామం దర్శించాడు. అక్కడ ఒక చాకలి తన బిడ్డలను నమ్మాళ్వార్ పేరిట పిలవడం ఆయన కెంతో ఆనందం కల్గించింది. తాను గృహస్థు అయివుండే తన సంతతిని అలా పిలుచుకోగలిగే వాణ్ణి కదా అని వాపోయాడు.

శ్రీమంతులను పొగడుతూ వారి దాన ధర్మాలను స్వీకరించడాన్ని నమ్మాళ్వారు

నిరసించాడు. ఎల్ల వేళలా భగవన్నామ స్మరణ చేసుకుంటూ ఉదరపోషణకు కాయకష్టం చేయడం ఉత్తమ మని ఆయన ఉద్బోధించాడు.

''భగవంతుని అవతారాలు ఎందుకు? అన్న ప్రశ్న'' పతితులను ఉద్ధరించడానికేనని నమ్మాళ్వారు జవాబు చెప్పాడు.

ఆంధ్రభక్తకవి పోతనవలెనే నమ్మాళ్వార్ కవిత్వం భగవంతుణ్ణి స్తుతించడానికే కానీ, నరాధముల పొగడటానికి కాదని భావించాడు.

భగవంతుణ్ణి ఆత్మలోనే దర్శించ గలమంటూ నమ్మాళ్వారు ఇలా వ్రాశాడు.

**"చందనపు బొమ్మలలో**
**చలువ రాతి పలకలలో**
**రంగు దిద్దిన పటాలలో**
**రంజిల్లెడు భగవంతుడు**
**తనలో మాత్రం లేడా!**
**వినుమా సర్వజ్ఞుడా!"**

(నమ్మాళ్వార్)

''విష్ణు భక్తిలేని విబుధుండు విభుధుఁడే. పాదయుగము తోడి పశువుగాక'' అన్నాడు పోతన్న.

హరి భక్తిలేని బ్రాహ్మడి కంటే ఛండాలుడే మేలు. చండాలుడు హరి భక్తుడైతే అతడే పూజార్హుడు''. అంటాడు నమ్మాళ్వారు.

తిరు విరుత్తంలో నమ్మాళ్వారు పరమ ప్రభుని కల్యాణ గుణాలను మధురంగా వర్ణించాడు.

భగవదవతారాలలో శ్రీకృష్ణావతారం నమ్మాళ్వారుకు అత్యంత యిష్టమైనది.

ప్రేయసీ ప్రియులుగా శ్రీకృష్ణునితో తాదాత్మ్యం చెందిన పరమ భాగవతుడు నమ్మాళ్వార్.



# కారైక్కాల్ అమ్మ

పార్వతీ పరమేశ్వరులు కైలాసంలో విహరిస్తున్న సమయం. ఒకానొక శక్తి తలక్రిందుగా తమవైపే రావడం గమనించిన పార్వతీ దేవి ఈశ్వరునితో ఇదేమి వింతగానున్నదే అన్నది.

మహాశివుడు బదులు చెప్తూ "ఆమె మనకు అత్యంత ప్రియ భక్తురాలు" అన్నాడు. ఇంతలో ఆ శక్తి ఆది దంపతుల సన్నిధికి రానే వచ్చింది. ఈశ్వరుడామెను "అమ్మా! నీకేమి వరాలు కావాలో కోరుకో' అన్నాడు. అందులకామె "నేను తిరిగి జన్మించాల్సి వస్తే నీ స్మరణ నిరంతరం కలిగేటట్లు వరమిమ్మంది. తాండవనృత్యం సలిపే శివుని పాద విన్యాసం కీర్తించే శక్తి ప్రసాదించమని మరొక వరం కూడా కోరింది.

పరమ శివుడు 'తథాస్తు' అంటూ ఆ పరమ భక్తురాలిని అనుగ్రహించాడు.

మహాదేవునిచే 'అమ్మ' అని పిలిపించుకున్న మహా భక్తురాలే కారైక్కాల్ అమ్మ.

తమిళదేశంలో సస్యశ్యామల తీరపట్టణం కారైక్కాల్. పలువురు వర్తక ప్రముఖులకు నిలయమై వాణిజ్య కేంద్రంగా ప్రసిద్ధినందినది. ధనదత్తుడు అక్కడి వర్తక సంఘానికి అధిపతి. ధర్మమార్గానుసారియైన ధనదత్తునికి కాలక్రమాన ఒక కుమార్తె కలిగింది. అపురూప సౌందర్యవతి అయిన ఆ బాలికకు పునీతవతి అనినామకరణం చేశారు.

పూర్వజన్మ సంస్కారం కారణంగా పునీతవతి బాల్య క్రీడలన్నీ ఈశ్వరుని చుట్టూ పరిభ్రమించేవి. యుక్త వయస్సు రాగానే తలిదండ్రుల ఆమె వివాహాన్ని తలపెట్టారు.

నాగ సముద్రానికి చెందిన నిధిపతి అనే వణిక్ప్రముఖుడు తన కుమారుడైన పరమ దత్తునికి వారి కుమార్తెను యిచ్చి పెండ్లి చేయమని ధర్మదత్తుని వద్దకు రాయబారం పంపాడు.

ధర్మదత్తుడు సమ్మతించగా ఒకానొక శుభముహూర్తాన పరమదత్త పునీతవతుల వివాహం వైభవంగా జరిగింది. ధర్మదత్తునికి పునీతవతి ఏకైక పుత్రిక అయిన కారణంగా

పరమదత్తుడు కారైక్కాల్‌లో ఇల్లరికపుటల్లుడుగా స్థిరపడినాడు.

పరమదత్తుని వ్యాపారం దినదినాభివృద్ధి చెందింది. పునీతవతి అతిథి అభ్యాగతుల సేవలో ఆనందంగా గడపసాగింది.

ఒక నాడు పరమదత్తుని చూడటానికి వచ్చిన మిత్రులు రెండు మామిడిపండ్లు తెచ్చి యిచ్చారు. వెంటనే అతడు వాటిని ఇంటికి పంపించాడు. పునీతవతి వాటిని జాగ్రత్త చేసింది.

ఇంతలో ఆకలి గొన్న శివభక్తుడొకడు యింటికి వచ్చి భిక్ష పెట్టమని కోరాడు. పునీతవతి అతనికి శ్రద్ధగా అన్నం వడ్డించింది. మారు వడ్డించడానికి కూరలేమీ లేకపోవడంతో భర్త పంపిన మామిడిపండు నొకటి అతిథికి యిచ్చింది. విందు భోజనంతో సంతృప్తి చెందిన అతిథి ఆనందంతో వెళ్లిపోయాడు.

మధ్యాహ్నం వేళకు ఇంటికి వచ్చిన యజమానికి అనురాగంతో అన్నం వడ్డించింది పునీతవతి. మిగిలిన ఒక్క మామిడిపండును కూడా వడ్డించింది. ఆ పండు మిక్కిలి మధురంగా వుండటం మూలాన పరమదత్తుడు మరొకపండు కోరాడు.

వంట గదిలోనికి వెళ్లి ఈశ్వరుని ప్రార్థించినదే తడవుగా పునీతవతి చేతిలో ఒక మామిడిపండు నిలిచింది. వెంటనే దానిని భర్తకు వడ్డించింది. ఆ పండు మరింత మధురంగా వుండటంతో భర్త పునీతవతిని అది ఎక్కడ లభించిందటూ ప్రశ్నించాడు.

ఒక క్షణం ఆలోచించిన పునీతవతి నిజాన్ని వెల్లడించింది. పరమదత్తుడామె మాటలను వెంటనే నమ్మలేక పోయాడు. ఇది నిజంగా ఈశ్వర దత్తమే అయితే మరొక పండుకోసం ప్రార్థించమన్నాడు భర్త.

ఈ సారి కూడా ఈశ్వరుడామె ప్రార్థన మన్నించాడు. కాని మామిడి పండు విస్తరిలో వడ్డించగనే అది అదృశ్యమైంది.

పరమదత్తుడు నిలువెల్లా వణికి పోయాడు. తన భార్య సాధారణ మానవ వనితగాదు. నిస్సందేహంగా ఆమె దివ్య స్త్రీ మూర్తి.

కొంతకాలం ఆమెకు దూరంగా వున్నాడు. తరువాత శాశ్వతంగా ఆమెను వదలి వెళ్లాలని నిశ్చయించుకున్నాడు.

వాణిజ్యం పేరిట విదేశాలకు పయనమైన పరమదత్తుడు చిరకాలం విదేశాలతో వర్తకం చేసి విశేష ధనం సంపాదించాడు.

కారైక్కాల్ తిరిగిరాకుండా పాండ్యనాడులో స్థిరపడినాడు. తాను వివాహితుణ్ణి అనే విషయం బయటపెట్టకుండా తిరిగి ఒక అందాల రాశిని పెండ్లి చేసికున్నాడు.

కారైక్కాల్‌లో పునీతవతి భర్త రాక కోసం ఎదురుచూస్తూ సంవత్సరాలు గడిపింది. కొంతకాలానికి ఆమె భర్త పాండ్యనాడులో స్థిరపడినట్లు తెలిసికొంది. బంధువులతో భర్తను చేరడానికి ప్రయాణమైంది. దూరం నుండే వస్తున్న తన భార్యను చూచిన పరమదత్తుడు గడగడ వణక సాగాడు. అక్కడ గుమిగూడిన వారితో "ఈమె సాధారణ స్త్రీ కాదు. దివ్యస్త్రీ. ఈమెతో నేను సంసారం చేయజాలనని" వివరించాడు.

మహాసాధ్వి అయిన పునీతవతి తన భర్తకు అవసరంలేని ఈ శరీరం కృంగి కృశించిపోవాలి అంటూ తనకు తానుగా శపించుకొంది. తక్షణం ఆమె ఎముకల గూడుగా మారిపోయింది.

ఆ వేషంలో ఆమె ముందుగా పార్వతీదేవిని గూర్చి 'అర్పుతా తిరు అంతాది' లో స్తుతించింది.

ఆమె కైలాసంవైపు ప్రయాణం సాగించింది. కైలాస ప్రాంతం చేరగానే తన పాదాలతో పయనించడం పాపమని తలచింది. తల క్రిందుగా పయనించింది.

మహాశివుడు ఈమెను అనుగ్రహించి 'అమ్మా' అని సంబోధించడంతో ఆమె అంకిత భక్తురాలని వెల్లడయింది.



# కులశేఖరాళ్వారు

ఆళ్వారులలో కెల్లా కులశేఖరుని కొక విశిష్ట స్థానం వుంది.

తమిళ, సంస్కృతాలలో విశేష పాండిత్యం కలిగి ఇతడు కవి కులశేఖరుడైనాడు. పన్నిద్ద రాళ్వారులలో ఈయన ఒకడు. 8వ శతాబ్ది ప్రారంభంలో జీవించాడు.

కులశేఖరుడు తిరువాంకూరు రాజవంశంలో తిరువంజక్కళం అనేచోట జన్మించాడు. ఈయన తండ్రి దృఢవతుడు. మహా భక్తుడు పసితనంలోనే తండ్రిని పోగొట్టుకున్నాడు కులశేఖరుడు.

రాజనీతిలో శిక్షణ పొంది యుక్తవయస్సు రాగానే కులశేఖరుడు చేర రాజ్యానికి ప్రభువైనాడు.

సమర్థుడైన పాలకుడుగా ఆయన కీర్తి దశదిశలా వ్యాపించింది.

కులశేఖరుని బాల్యంలో జరిగిన సంఘటన అచ్చెరువు గొల్పుతుంది.

యువరాజుకు నిత్యం రామాయణం చెప్పే గురువు ఒకనాడు రాలేదు. ఆయన తన కుమారుణ్ణి తనకు బదులుగా పంపాడు.

రావణుడు సీతను అపహరించిన ఘట్టం వివరిస్తున్నాడు. గురు పుత్రుడు - బాల కులశేఖరుడు ఎంతో ఆసక్తితో వింటున్నాడు.

రాను రాను కథా కథనం వింత పోకడలు పోయింది. సీతా విరహంతో శ్రీరాముడు పొందిన బాధ వివరిస్తూ కన్నీరు కార్చాడు కథకుడు.

కులశేఖరునికి రావణుని పట్ల క్రోధం హెచ్చింది.

రాజు తలుచుకుంటే కొదవేముంది? తన సైన్యాధిపతిని పిలిపించి లంకపై దండయాత్రకు సిద్ధం కావలసిందిగా ఉత్తర్వుచేశాడు.

రాజ మందిరం అంతటా ఉద్రిక్తత ఏర్పడింది. ఏమీ చేయాలో తోచక సభాసదులు నివ్వెర పోసాగారు. విషయం అంతా రామాయణం పాఠం చెప్పే పెద్ద పండితుని చెవిన బడింది.

ఆయన తక్షణం రాజమందిరానికి వచ్చాడు. "సీతాదేవి క్షేమంగా వుంది. శ్రీరాముడు లంకపై దండెత్తి ఆమెను విడిపించుకున్నాడ"ని బిగ్గరగా చెప్పాడు - అంతటితో కులశేఖరుడు తృప్తి చెంది నిట్టూర్పు విడిచాడు.

కులశేఖరుని వైష్ణవ భక్తి నిరుపమానం. వైష్ణవ భక్తులకు రాజా స్థానంలో

ఎల్లవేళలా స్వాగతం లభించేది.

మంత్రులకీ పద్ధతి సుతరామూ గిట్టలేదు. వారందరూ కుట్ర పన్ని వైష్ణవ ఆధిక్యం తొలగించాలని నిర్ణయించుకున్నారు.

ఒక్కనాడు రాజమందిరం నుండి అమూల్యమైన నవరత్న మాల మాయమైనది. ఎప్పుడూ ఆ స్థానాన్ని అంటిపెట్టుకుని వుండే భాగవతుడే ఈ పనిచేసి వుంటాడని మంత్రి మండలి తీర్మానించింది.

కానీ, ప్రభువు ఈ నిర్ణయాన్ని ఏ మాత్రం ఒప్పుకోలేదు.

కఠిన పరీక్ష ఒకటి కులశేఖరుడు ఏర్పాటు చేశాడు.

నల్లత్రాచు పామును తన చేతిలో ఉంచుకొని - భాగవతులే నవరత్న మాలను దొంగలించి నట్లయితే తననీ నల్ల త్రాచు పాము కాటేస్తుందనీ. ఆవిధంగా జరుగక పోతే వైష్ణవ భక్తులు నిర్దోషులే నని రాజు ప్రకటించాడు.

కఠోర పరీక్షకు పూనిన రాజు ప్రాణం పట్ల కుట్రదారులు భీతి చెందారు. ఈ విధంగా నిర్ణయిస్తారని వారు భావించలేదు.

చిత్రంగా రాజు చేతిలో ఉంచుకున్న విష సర్పం చల్లగా జారుకొని ఏ మాత్రం హాని చేయకుండా పరిసరాల్లోని పొదలలోనికి వెళ్ళిపోయింది.

భాగవతుల వదనాలు ఆనందంతో మెరిశాయి. కుట్రదారుల మొగాలు మాడిపోయాయి.

తమ తప్పిదాలు తెలుపుతూ ప్రభువు పాదాలపై బడ్డారు. కులశేఖరుడు వారిని క్షమించాడు.

రాజ్య నిర్వాహణకు తగిన ఏర్పాటు చేసి కులశేఖరుడు రాజ్యం లోగల పుణ్యక్షేత్రాలన్నీ దర్శించాడు. తిరిగి వచ్చి సమర్థులకు రాజ్యం వప్పజెప్పి తిరునగరి ఆళ్వారు చెంత శిష్యుడిగా చేరాడు.

కులశేఖరుని రచనలలో పెరుమళ్ తిరుమోళి ప్రసిద్ధం. దీనిలో నూట అయిదు పాశురాలు ఉన్నాయి. ద్రావిడ వేదం అని దీనికి పేరు. నాలాయిర దివ్య ప్రబంధంలో చేర్చబడి వైష్ణవులకు ప్రీతి పాత్రమైనది.

కావేరీ తీరంలో వెలసిన శ్రీరంగనాథుణ్ణి. తిరుమలలో వేంచేసిన శ్రీనివాసుణ్ణి కులశేఖరులు పలుమార్లు దర్శించి స్తుతించాడు.

శ్రీ వేంకటేశ్వరుడు వసించు కొండలలో తానొక చంపకమై పుట్టిన ఎంత బాగుండునని తలపోస్తూ ఈ పాట వ్రాశాడా పరమ భక్తుడు.

''ఒక్క వర మిదియే
కోరుచున్నవాడ!
కొదమ తుమ్మెద గమి
రొదనదరిపోవు--
నీవు నివసించు కొండల
నెలవులందు
నేను చంపకమై
పుట్టి నిమ్ము దేవ! (విశ్వంగారి తెనుగుసేత)

కులశేఖరుని రచనలలో ముకుందమాల తలమానికము. తాను ప్రభువై యుండి దివ్య ప్రభువు మ్రోల తన అల్పజ్ఞతను చాటుకున్న కులశేఖరుల వంటి భక్త శిఖామణులు అరుదు.

భగవంతుని తల్లిగా భావించి వ్రాసిన గేయంలో భావం ఎంత సున్నితంగా వుందో గ్రహించగలం.

బాధామయ పాన పాత్ర
ప్రభూ నాకు ప్రాప్తించెను
పిపాసినై వేడు చుంటి
వేదననే అందించుము
ఎంత తిట్టి ఏడ్పించిన
యింత నిసువు విడుచునా తన తల్లిని
*తరచి తరచి తన్మయుడై అడుగడా!*
(కులశేఖర పెరుమాళ్ గీతానికి విశ్వంగారి తెనుగు సేత)



# స్వాతి తిరునాళ్



భక్తిలేని సంగీత జ్ఞానము వల్ల ప్రయోజనం లేదని. త్యాగరాజ స్వామి తెలిపాడు. కాగా, సంగీత, సాహిత్యాలు భగవంతుని కీర్తించడానికే వినియోగించాలని చాటిన మహనీయుడు స్వాతి తిరునాళ్.

19వ శతాబ్దంలో తిరువాంకూరు నేలిన స్వాతి తిరునాళ్ గొప్పభక్తుడు.

1813 ఏప్రియల్ 16న రామవర్మ మహారాజుకు జన్మించాడు. స్వాతి నక్షత్రాన జన్మించిన రాజ కుమారుని స్వాతి తిరునాళ్‌గా పిలువసాగారు.

కేరళ అడవులలో ఒక మగ తెల్ల ఏనుగు రాజకుమారుడు జన్మించిన సమయానికే కనబడడం గొప్ప శుభ సూచకంగా ప్రజలు భావించారు.

తిరువాంకూరు రాజ్యంలో వున్న బ్రిటిష్ ప్రతినిధి జాన్‌మన్రో తన సంతోషం ప్రకటిస్తూ త్రివేండ్రంలోని పద్మనాభ స్వామికి వెండి ఊయల బహూకరించడు.

యువరాజు జన్మించిన నాలుగు నెలల లోపునే (1813 జూలై 29న) రాజ్యానికి అధిపతిగా ప్రకటించారు.

రాణి లక్ష్మీబాయి 1815లో తన చెల్లెలు పార్వతీబాయికి బాలునప్పగించి కన్ను మూసింది.

సంస్కృతంతో పాటు ఇతర భాషలెన్నో స్వాతి తిరునాళ్ గొప్ప పండితుల చెంత నేర్చాడు.

తంజావూరు సుబ్బారావు ఇతని గురు సమూహంలో అగ్రగణ్యుడై స్వాతి తిరునాళ్ అభ్యున్నతికి కారణ భూతులైనారు.

విద్య లన్నింటిలోనూ పరిపూర్ణుడైన స్వాతి తిరునాళ్ తన పదహారవయేట (16) రాజ్యాధికారం స్వీకరించాడు.

అనేక దేశ భాషలతో పాటు ఆంగ్లం, సంగీతంలో కూడా ప్రతిభ ప్రదర్శించారు.

తన విద్యా దాత అయిన సుబ్బారావునే దివానుగా నియమించి స్వాతి తిరునాళ్ ప్రజలకు చక్కని పరిపాలన చేకూర్చాడు.

సుబ్బారావు దివానుగా కొనసాగిన కాలం (1840 వరకూ) తిరువాన్కూరు చరిత్రలో స్వర్ణయుగం. కవులూ, గాయకులు, శిల్పులు మొదలగు వారికి రాజా స్థానంలో విశేష ఆదరణ లభించింది.

పాలనలో నేర్పుతో పాటు స్వాతి తిరునాళ్ సంగీత సాహిత్యాలు మేళవింపు జరిగింది.

సంస్కృతంలో స్వాతి తిరునాళ్ రచించిన గ్రంథాలు గొప్ప భక్తి ప్రబోధకాలు. వీటిలో భక్తి మంజరి అనేది గొప్ప స్తోత్రం. ఇది తమ ఇలవేలుపు అయిన పద్మనాభస్వామిపై చెప్పినది.

నూరు పద్యాలు గల ఈ రచన పది భాగాలుగా విభజింప బడింది. తొమ్మిది విధములైన భక్తి మార్గాలు - పద్మనాభుని అపురూప సౌందర్యం ఇందు మహత్తరంగా వర్ణించ బడినది.

''శ్యానందూర పురవర్ణన'' స్వాతి తిరునాళ్ సంస్కృతంలో రచించిన మధురకావ్యం. పద్మనాభ స్వామి ఆలయ చరిత్ర యిందులో మలచబడినది.

తిరునాళ్ సంస్కృత రచనలలో పద్మనాభ శతక మొకటి. ఇందలి పద్యాలు స్వామి చెంత ఈనాటికీ వల్లిస్తుంటారు. ఓ పద్య భావం యిలా వుంది. 'తిట్టినా కొట్టినా బాధలో కూడా బిడ్డ తన మాతృమూర్తిని అమ్మా అంటాడు. అలాగే నేను కూడా ఎల్ల వేళలా స్వామినే సేవిస్తాను'

తిరువాన్కూరు పాలకులు తాము పద్మనాభ దాసులమని చెప్పుకునే వారు. స్వాతి తిరునాళ్ విషయంలో ఈ సంగతి అక్షరాల సత్యం.

చిన్న తనం నుండి స్వామిని ప్రతి నిత్యం దర్శించి సేవించిన స్వాతి తిరునాళ్‌కు దివ్య శక్తులుండేవని ప్రజల విశ్వాసం.

ఒకసారి స్వామి పట్టపు ఏనుగు అదుపు తప్పి మావటీడుని సైతం లెక్క చెయ్యలేదు. స్వాతి తిరునాళ్ తన దృష్టి దానిపై బడిన వెంటనే సాధువుగా మారింది.

ఆనాటి నుండీ తమ ప్రభువు నరసింహస్వామి అంశగా భావించేవారు ప్రజలు.

చివరి దినాలలో స్వాతి తిరునాళ్ అనారోగ్యంతో మంచం దిగని స్థితిలో ఒకనాడు స్వామి ముందు తన ప్రభువు కన్పించినట్లు అర్చకునికి తోచింది. పరుగు లంఘిస్తూ ఆలయాధికారి కోసం వెళ్ళాడు అర్చకుడు. వారు తిరిగి వచ్చేసరికి మహారాజు కన్పించలేదు.

కొద్ది క్షణాల్లో మహారాజు మరణవార్త దేశమంతా ప్రాకింది.

ఆనాడు 1846 సంవత్సరం, డిసెంబరు 25 స్వాతి తిరునాళ్ ఆత్మ పద్మనాభునిలో ఐక్యమైపోయింది.

ఉత్తమ సంగీతానికి ఈ నాలుగు అంశాలు - భావ, రాగ, తాళ, భక్తి అవసరం.

త్యాగరాజులో భావం, దీక్షితర్‌లో రాగం, శ్యామ శాస్త్రిలో తాళం,స్వాతి తిరునాళ్ భక్తి పరాకాష్ఠ చెందాయని పెద్దల భావన.

తెలుగులో రచించిన కీర్తన వలపు తాళ వశమా నా సామికి చలము సేయన్యాయమూ".

"ఇటు సాహసముల ఏల నాపై చక్కని స్వామీ" అనే జావళి మిక్కిలి ప్రసిద్ధమైనది.

సంగీతాన్ని యోగంగా భావించి అధ్యయనం చేసిన వాడు యేరుస్వామి. ఈతడే మహారాష్ట్ర పద్ధతిని హరికథ కాలక్షేపం ప్రవేశ పెట్టారు.

స్వాతి తిరునాళ్ కుచేలో పాఖ్యానం, అజామిళోపాఖ్యానం సంస్కృతంలో రసవత్తరంగా హరికథగా రచించారు.

దీక్షితు సోదరుడైన వడివేలు మన సంగీతంలో వయోలిన్ ప్రవేశ పెట్టినాడు.

త్యాగరాజు స్వామి శిష్యుడైన కన్నయ్య భాగవతార్. మృదంగంలో ప్రవీణుడైనాడు. షట్కాల గోవిందమారర్, పరమేశ్వర భాగవతార్ గాత్రంలో అగ్రగణ్యుడు.

ఇలాంటి వారెందరో స్వాతి తిరునాళ్ రాజాస్థానంలో నిలయ విద్వాంసులుగా వుండేవారు.

జీవించిన కొద్దికాలంలోనే తన కీర్తిని తరతరాలకు నిలిచే అనేక పనులు సాధించిన భక్త శిఖామణి స్వాతి తిరునాళ్.



# తిరుప్పాణాళ్వార్

శ్రీరంగంలో నెలకొనివుండే శ్రీరంగశాయికి తిరుమంజనం చేసేందుకు వేకువజామునే కావేరీనదికి విచ్చేశారు వైష్ణవస్వాములు

స్నాన ఘట్టంలో అప్పటికే స్నానం చేసి నామాలు పెట్టుకొని చేత వీణ పుచ్చుకొని తన్మయంతో రంగణ్ణి మధుర గానంతో కీర్తిస్తున్న భక్తుడొకడు వారి కంట పడినాడు.

వైష్ణవ స్వాములు వాని భక్తి ప్రపత్తులకు పరవశులైనారు. కానీ వారి పారవశ్యం అతణ్ణి సమీపించేసరికి కుంచించుక పోయింది.

అతడు చేసిన పాపం?

అతడు అంటరాని వాడు కావడమే!

వైష్ణవ స్వాములలో సారంగ మునిది విశిష్ఠ స్థానం. అతని అనుచరులు కలవరపడ సాగారు.

తమ "మడుగు" మంట గలసి పోయిందేనని వారి బాధ.

బ్రాహ్మీ ముహూర్తంలో పంచముని దర్శనం ప్రాప్తించింది కదా అని వారి ఆవేదన.

అతన్ని అదిలించి చూచారు.

కేకలు వేశారు.

ఊహూఁ భక్తుని రాగం పంచమ స్వరంలో తారాస్థాయినందుకొన్నది.

వాగాడంబరము వలన ప్రయోజనం కన్పించలేదు. ఇది కాదు మార్గం అనుకొని భుజశక్తి ప్రయోగించ సాగారు. అంటరాని వానిపై వాడియైన రాళ్ళవర్షం కురిపించారు.

రక్తం ధారలు కట్టింది కానీ, చేత వీణియ శృతి తప్పలేదు.

రెట్టించిన శక్తితో ఎడతెరిపి లేక బాధించారు. ఆ పరమ భాగవతుణ్ణి కొంతసేపటికి వీణియ మ్రోత ఆగింది. భక్తుడు కన్నులు తెరిచి చూచాడు. తన ఉనికి వల్ల వైష్ణవ స్వాములకు అపచారం జరిగిందని వెతనొంది తన గుడిశె చేరాడు ఆపూతచరితుడు.

సారంగముని అనుచరవర్గం "స్వర్గధామం" లభించినంత ఆనందించారు. పంచముడి పీడ విరుగడయిందని సంతసించారు.

అంటరానివాణ్ణి చూచిన "పాపం" పోవడానికి కావేరి నీటిలో గంటలకొద్దీ మునకలు వేసి శుద్ధులై బంగారు కలశాలతో పవిత్ర జలాన్ని తీసుకొని శ్రీరంగనాథుని ఆలయ ప్రవేశం చేశారు.

శ్రీరంగనాథుని దర్శించేసరికి వైష్ణవ స్వాముల ముఖాలు వెల వెలపోసాగినవి. తాము మోదిన పంచముని శరీరానికి పడిన తూట్లన్నీ రంగనాథుని విగ్రహం మీద తేలినవి.

కలవరపడిన స్వాములు గోడు గోడున విలపించ సాగారు.

శ్రీ రంగధామ ప్రభూ! కరుణించు! కరుణించు!

"అడియేన్‌దాసుడ" అంటూ మోకరిల్లారు.

సారంగమునికి భగవద్వాణి ఇలా వినిపించింది.

"మీరు కావేరీ నదిలో హింసించిన పాణర్ మహాభక్తుడు. అతనిని నీ భుజములపై మోసుకొని రమ్మ"ని అనుజ్ఞ అయింది.

సారంగముని అనుచర వర్గంతో వెలివాడ ప్రవేశించి పాణర్‌ను వేడుకొని క్షమాపణ చెప్పుకొన్నారు. స్వయంగా అతనిని తన భుజములపై ఎక్కించుకొని శ్రీరంగనాథుని దివ్యదర్శనం చేయించాడు. ఆ పాణరే తిరుప్ప నాళ్వార్.

ఆళ్వారులు వైష్ణవ సంప్రదాయమునకు మూలపురుషులు.

భగవంతుని వాణి వీరి వాక్కుల ద్వారా వెలువడినందున వీరు ఆళ్వారులని పిలువబడిరి.

"ఆళ్వారు" పదమునకు కాపాడువారు అని అర్థం.

పన్నెండుమంది ఆళ్వారులూ విష్ణుదేవుని వేర్వేరు అంశాలతో అవతరించినట్లు భావింప బడుతున్నది. శ్రీవత్సలాంఛన (పుట్టు మచ్చ) అంశంతో అవతరించినవాడు తిరుప్పనాళ్వారు.

"ప్రాణయోగి" అని కూడా వీరిని పిలుస్తారు.

గోదాదేవి తులసి వనములో విష్ణు చిత్తునికి కన్పించినట్లే ప్రాణయోగి కూడా శ్రీరంగం సమీపంలోని నిచుళాపురంలోని మాలదాసరికి వరిపొలంలో కన్పించగా వారిని ఇంటికి తెచ్చి పోషించాడు. లోక సారంగుడను ముని ఇతనిని తన భుజములపై నిడుకొని శ్రీరంగేశుని సన్నిధికి కొనిపోయెనని ఆరంభముననే తెల్పబడినది.

సారంగముని భుజములపై మోయబడిన ఇతడు "ముని వాహనుడ"య్యెను.

శ్రీరంగని దర్శించిన ఆనంద పారవశ్యమున మునివాహనుడు కీర్తించిన పాశురములు "అమలానాదిపిరాన్" పేర ప్రఖ్యాతి గాంచినవి.

ప్రాణయోగి శ్రీరంగధాముని గుణగానము చేసిన తీరు దివ్యమైనది.

**"బరువైన నాపాత పాపాల మొదలంట**

**నఱికినను తమవైపునకుఁ జేర్చి కొనుటటుండ**

**నీ, రంగపతి నాదు నెమ్మదిని జొరబారె**

**నేనెఱుగ ఘోర తపమేమి యొనరించినొ**

**తులసిదండకు రమకు నెలవైన ఎదలోన**

**నను దాసు జేర్చికొన్నాడు తనవానిగా**

(శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మగారి అనువాదము)

ఏ వ్యక్తి అయితే అహంకారం అణుమాత్రం లేకుండా భగవంతునికి తనను అర్పణ చేసుకొనునో అతడే అసలైన విష్ణుభక్తుడని తిరుప్పాణాళ్వారు పుణ్యచరిత చాటుతున్నది.

**"విష్ణుభక్తిలేని విబుధునికంటే**

**విష్ణుభక్తికల పామరుడే మిన్న"**

అని భారతం కంఠోక్తిగా చెప్పింది.



# జ్ఞానదేవ్ (1275-1296)



మహారాష్ట్ర దేశంలో "అపగాన్" గ్రామానికి చెందిన విఠల్ పంత్ మంచి పండితుడు. రుక్మాబాయ్ అనే యువతిని వివాహం చేసుకొని కొంతకాలం సుఖంగా వున్నాడు.

నడివయస్సులో విఠల్ పంత్ కాశీవెళ్ళి రామానంద్ అనే గురువు వద్ద దీక్ష తీసుకొని సన్యాసి అయినాడు. రుక్మాబాయ్ ఈ సంగతి విని దుఃఖించలేదు. పుణ్యక్షేత్రాలు దర్శించ సాగింది. రామానందుడు తన సంచారంలో "ఆళాండి" విచ్చేశారు. అక్కడ రుక్మాబాయ్ అతణ్ణి సేవించింది. "పుత్రవతివి కాగలవు" అని ఆమెను రామానందుడు ఆశీర్వదించాడు. రుక్మాబాయ్ దుఃఖంతో తన భర్త సన్యాసియైన వైనం తెలిపింది.

వెంటనే రామానందుడు కాశీ వెళ్ళి తన శిష్యుణ్ణి సంసార జీవనం గడపమని ఆదేశిస్తాడు. గురువు ఆనతి మన్నించి విఠల్ పంత్ తన ప్రాంతానికి చేరాడు.

కాలక్రమాన విఠల్ పంత్ రుక్మాబాయిలకు నివృత్తినాథ్, జ్ఞానదేవ్, సోపాన్ దేవ్, అనే కుమారులు, ముక్తాబాయ్ అనే కుమార్తె కలిగారు. విఠల్ నాధుణ్ణి కపట సన్యాసి అని సంఘం అవహేళన చేయసాగింది.

ఆ కుటుంబం అడవుల పాలయింది. నాసిక్ సమీపం లోని అడవిలో ఒక పులి ఎదురుకావడంతో భయంతో చెల్లా చెదురై పారిపోయారు.

నివృత్తినాథ్ గుహలో ప్రవేశించాడు. అక్కడ "గాహినీనాథ్" అనే సిద్ధ పురుషుడు ఏడు ఏండ్ల నివృత్తి నాథుని చేరదీసి నాథ సంప్రదాయంలో ఉపదేశం చేశాడు.

కొంతకాలానికి నివృత్తినాథ్ జ్ఞానదేవ్‌కు దీక్ష యిచ్చాడు.

విఠల్ పంత్ కుటుంబాన్ని వదలి అడవికి వెళ్ళిపోతాడు. బిడ్డలు దిక్కులేని వారైనారు. ఉపనయనం చేయించమని ఊరి పెద్దలను అడిగారు.

వారు అందులకు ఒప్పుకొనకుండా "మీ నాయన కపట సన్యాసి మీరు అందుకు తగినవారు కాదు" అని చెప్పి కావాలంటే పైఠాన్ వెళ్ళి పండితులను అడగమంటారు. బాలురు పైఠాన్ వెళ్ళారు. అక్కడి పండితులు మీ పేర్లుయేమిటి అని పిల్లవాండ్లను ప్రశ్నిస్తారు. 'నివృత్తినాథ్' 'జ్ఞానదేవ్' అని చెప్పగా "ఆహా! ఏమి పేర్లండి. దున్నపోతులకు ఉండాల్సిన పేర్లు" అని ఎకసెక్కం ఆడాడు ఒక పండితుడు.

ఇంతలో అవైపే వెడ్తూన్న ఒక దున్నపోతును జ్ఞానదేవ్ పిలుస్తాడు. చిత్రంగా జ్ఞానదేవ్ ఆజ్ఞమేరకు దున్నపోతు నోటి నుండి వేదం వెలువడుతుంది. వీళ్ళు సామాన్యులు కారు అని భావించిన పండిత సంఘం ఉపనయన సంస్కారానికి మీరు తగిన వారే అని చెపుతుంది.

ఇంతటి విచిత్రం మరి ఒకసారి జరిగింది. జ్ఞానదేవుడు, అతని చెల్లెలు గోడమీద కూర్చుని ఉండగా చాంగ దేవుడనే యోగి పులి మీద స్వారీ చేస్తూ కన్పించాడు.

జ్ఞానదేవ్ సోదరితో సహా గోడను నడుపుకుంటూ వెళ్ళి అతనికి స్వాగతం పలుకుతారు. జ్ఞానదేవుడు చాంగదేవ ప్రశస్తి చేస్తూ గ్రంథం వ్రాశాడు.

క్రీ.శ. 13వ శతాబ్దిలో మహారాష్ట్ర దేశంలో భాగవత ధర్మానికి పునాదివేసిన వాడుగా జ్ఞానదేవ్ పేర్కొనబడినాడు.

కాగా ఏకనాథ్ దానిని అభివృద్ధి చేసినాడు. తుకారం మూల స్తంభంగా నిలిచినాడు.

తన కాలంలోని ఛాందసుల ఒత్తిడిని ఎదుర్కొని భగవద్గీత వ్యాఖ్య ప్రాకృతంలో రచించాడు జ్ఞానదేవ్.

దీనిని జ్ఞానేశ్వరి లేదా భావార్థ దీపిక అనికూడా పిలుస్తారు.

సంప్రదాయాన్ని మన్నించిన జ్ఞానదేవ్ తన రచన విఘ్నేశ్వర ప్రార్థనతోనే ప్రారంభించాడు.

బ్రహ్మ విద్య సామాన్యజనులకు అందుబాటులో ఉండాలనే తలంపుతోనే

జ్ఞానదేవ్ జ్ఞానేశ్వరిని ప్రాకృతంలో రచించాడు.

వేదాంత విషయాలు వివరించటంలోనే కాక సాహితీ పరంగా కూడా మేటియైనదీ గ్రంథం.

మరొక మహా భక్తుడు నామ్‌దేవ్ జ్ఞానదేవ్‌ను అవతార పురుషుడిగా వర్ణించాడు.

కేవలం ఇరవై ఒక్క సంవత్సరాలు మాత్రమే భూమిపైన వాసం చేసిన జ్ఞానదేవ్ తన రచనల ద్వారా విశ్వ విఖ్యాతుడైనాడు.

మహారాష్ట్ర భక్తులకు నిత్యపారాయణ గ్రంథమైన "జ్ఞానేశ్వరి" అనేక భాషలలో అనువదింప బడింది.

జ్ఞానదేవ్ అభంగాలనేకం వ్రాశారు. జ్ఞానమోక్షదాయకాలైన ఈ గేయాలు బహుళ ప్రచారంలో వున్నాయి.

అంభాంగాలలో అడుగడుగునా విఠలుని ప్రస్తావన ఉంటుంది. "జ్ఞానేశ్వరి" లో ఆ ప్రస్తావనే ఉండదు. భాషలోనూ చాలా అంతరం ఉండటం చేత "జ్ఞానేశ్వరి కర్త" అభంగాల రచయిత ఒకరేనా కాదా అని విద్వాంసులు ఒకప్పుడు సంశయించారు. భగవంతుణ్ని అనేక రూపాలతో తాను దర్శించినట్లు జ్ఞానదేవ్ స్వయంగా చెప్పాడు.

జ్ఞానదేవ్ రచనలో వై విధ్యం ఉన్నా వారి ధ్యేయం ఒకటే!

పంచదార రాశినుండి ఏ భాగం స్వీకరించినా మాధుర్యమే కదా!

జ్ఞానదేవ్ ఇతర రచనలలో హరిపద్ "అనుభవామృతం" ప్రసిద్ధాలు.

మానవుడీ జన్మలోనే మోక్షం సాధించాలనే తలంపుతో తాను అనుభవామృతం రచించినట్లు జ్ఞానదేవ్ చెప్పాడు.

తన ఆధ్యాత్మిక ఔన్నత్యానికి ప్రోత్సాహకుడుగా తన సోదరుడైన నివృత్తినాథ్ కారణమని జ్ఞానదేవ్ తెలిపాడు.

భగవద్గీతను పాకృతంలో వివరించి నందుకు జ్ఞానదేవ్ ఇంటిల్లి పాదికి సంప్రదాయ ఛాందసులనుండి ఎన్నో ఇబ్బందులు ఎదురైనాయి.

జీవన్ముక్తుడైన జ్ఞానదేవ్ దేహత్యాగాన్ని నామ్‌దేవ్ ఇలా చెప్పాడు.

నిర్ణీత సమయానికి సమాధిలో జ్ఞానదేవ్ ప్రవేశించారు. తనకు ముందు "జ్ఞానేశ్వరి" గ్రంథాన్ని ఉంచుకున్నాడు.

ముకుళిత హస్తుడై ముమ్మారు నమస్కారాలు చేసి పిమ్మట కండ్లు మూసుకున్నాడు.

ఆది శంకరుల వలె అఖండమైన మేధావి జ్ఞానదేవ్.

# తుకారాం (1608-1649)



పూనా సమీపంలోని దేహూ పట్టణంలో మహాభక్తుడొకడు అద్భుతంగా గానం చేస్తున్నాడు.

మహారాష్ట్రుల నాయకుడు శివాజీ కూడా శ్రోతలలో చేరి ఆనందిస్తున్నాడు.

శివాజీని పట్టుకోవడానికి అంతకుముందు ఎంతకాలంగానో ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ ప్రాంతం సుబేదారుకు శివాజీ భజన కాలక్షేపంలో వున్నట్లు తెలిసింది. ఇదే సమయం అనుకొని తానూ భక్తులలో చేరిపోయాడు.

గానం చేస్తున్న మహాభక్తునికీ సంగతి తెలిసిపోయింది. ఎలాగైనా శివాజీని కాపాడగలిగితే బాగుండునని తలచాడు. అప్పుడొక అద్భుతం జరిగింది. సుబేదారు కండ్లకు అందరూ శివాజీలాగా కన్పించారు.

తన సంకల్పం విరమించుకొని సుబేదారు పలాయనం చిత్తగించాడు.

అంతటి దివ్యశక్తిగల మహాభక్తుడు మరెవ్వరో కాదు. భక్త తుకారాం.

పరమ పుణ్యధామమైన పండరిని మ్రొక్కుబడిగా దర్శించే భక్తులను వరకారీ లంటారు. వీరు వీలయినన్ని పర్యాయాలు పాండురంగని సేవించేందుకు పండరి వెళ్తుంటారు.

ఇలాంటి వారిలో 16వ శతాబ్దంలో జీవించిన విశ్వంభరుడు ప్రముఖుడు. అనివార్య కార్యాలవల్ల విఠలదేవుని దర్శనం సాధ్యం కాకపోతే విలవిలలాడేవాడు. ఇది గమనించిన స్వామి తన దేవేరితో విశ్వంభరుని కోసం దేహూలోనే అవతరించాడు.

ఈ విశ్వంభరుడే భక్త తుకారాం మూలపురుషుడు

తుకారాం శిశువుగా వున్నప్పుడు సాక్షాత్తూ రుక్మిణీదేవియే అతనికి జోలపాట పాడిందట.

తుకారాం పూర్వులు రైతులు. తర్వాతవారు వ్యాపారం చేపట్టారు. ఇతని తండ్రి బల్హోబా గ్రామాధికారిగా సుఖజీవనం గడిపాడు.

భీకరమైన కరువు రక్కసి కుటుంబాన్ని పీల్చివేసింది. తుకారాం సోదరుడు ఇల్లు విడిచి దేశాలు పట్టి పోయాడు.

తుకారాం మొదటి భార్య పిల్లవాడు కూడా విధి చేష్టలకు ఆహుతై పోయారు.

ఈ దశలో తుకారాంకు గురుదర్శన భాగ్యం లభించింది.

తన భాగానికి వచ్చిన కొద్దిపాటి పిత్రార్జితాన్ని తుకారాం తమ్ముడికి వదలివేసి పండరి చేరాడు.

వంశానుగతంగా వచ్చినవాటిలో పండరి యాత్ర అత్యంత విలువైనదిగా తుకారాం భావించాడు.

శివాజీ మహారాజు యివ్వజూపిన అపార సంపదను తుకారాం తృణీకరించాడు.

పస్తులున్న దినాలలో తాను ఆ రోజు భగవంతుడి అతిథినని చెప్పేవాడు తుకారాం.

భగవత్ సాక్షాత్కారం లభించే వరకూ పట్టుదలతో దీక్ష సాగించాడు తుకారాం. తుకారాం రచించిన భక్తి గీతాలను అభంగాలంటారు.

అభంగాలను తుకారం పాడేటప్పుడు వినడానికి వేల సంఖ్యలో జనం గుమిగూడేవారు. ఆచార పరులనేబడే ఛాందసులకు ఇది కంటగింపుగా వుండింది.

తుకారాం గాథలు గల వ్రాతపతిని నదిలో పారవేయించారు. కానీ భగవదను గ్రహం మూలాన ఏమాత్రం తడిలేకుండా అవి తుకారాం వద్దకు వచ్చి చేరాయి.

బుద్ధభగవానునికి మాదిరే తుకారం దేహశుద్ధికి గురి అయినాడు.

దుండగుల పట్ల కూడా తుకారాం అపారకరుణనే ప్రదర్శించాడు.

ఇతనిని మొదట తీవ్రంగా ఎదుర్కొన్న రామేశ్వర భట్ తరువాత ముఖ్య శిష్యుడైనాడు.

సర్వ భూతాలలో పరమాత్మణ్ణి దర్శించిన మహితాత్ముడు తుకారాం. తన నివాస ప్రదేశంలో చేరిన పిచ్చి కుక్కకు దూరంగా ఉండమని గ్రామస్థులు చేసిన హెచ్చరికను తుకారాం లక్ష్యపెట్టలేదు. విఠలుని స్మరిస్తూ కుక్కను తుకారాం సమీపించాడు. పాదాలు స్పృశిస్తూ ఆ కుక్క పెంపుడు జంతువుగా మారింది.

మానవసేవయే మాధవసేవ"గా భావించిన మహనీయుడు తుకారాం.

తుకారాం అంత్యదశ ఆశ్చర్యకరంగా ముగిసింది.

తన శిష్యబృందంతో భక్తి పారవశ్యంతో సంకీర్తనం చేస్తుండగా దివ్యజ్యోతి ఒకటి గోచరమైంది.

భక్త బృందం క్షణకాలం కన్నులు మూసికొన్నది. వారు కండ్లు తెరిచే సరికి తుకారం భౌతిక శరీరం జ్యోతిలో లీనమైపోయింది.

తుకారాం సూక్తులు విశ్వజనీనాలు. సార్వకాలీనాలు.

"సాధువులు దీపావళి, దసరా పండుగలలో మన ఇండ్లకు వస్తారు. వారి రాక వైకుంఠం కదలివచ్చినట్లే వుంటుంది".

"మనసుకు కొంచెంగా దైవభక్తి రుచి గనుక చూపిస్తే అది దానిని ఇంకవదలనే వదలదు".

"విగ్రహాన్ని మనస్సులో ప్రతిష్టించు అది అక్కడే పూజలందుకుంటుంది".

'దశరథ పుత్రుడు రాముడు మొన్నటివాడు కాదు. ఆత్మారాముడు శాశ్వతుడు'.



# కుమ్మరి గోరా



ఆషాఢ శుద్ధ ఏకాదశి పండరిక్షేత్రంలో మహావైభవంగా జరుగుతుంది. నామ్‌దేవ్ అనే భక్తుడు స్వామిని దర్శించేందుకు వెళ్ళాడు. భక్తి పారవశ్యంతో అనేక కీర్తనలు పాడాడు. పాండురంగడు మందిరంలో అతనికి కన్పించలేదు.

వెంటనే ఏదో స్ఫురణకు వచ్చి కుమ్మరి గోరా ఇంటికి వెళ్లాడు. అతడు స్వామిపై కీర్తనలు పాడుకుంటూ తన్మయుడై నృత్యం చేస్తున్నాడు. మరొకరు అతనికి బదులు కుండలు చేస్తున్నాడు. అతడే పాండురంగడు.

కుమ్మరి గోరాకు చేతులు లేవు. స్వామి అతనికి సాయంచేస్తూ కుమ్మరిపని చేస్తున్నాడు.

భగవంతుడు భక్తులకు దాసుడు కదా!

మహారాష్ట్రలో తార్డోకి చిన్న గ్రామం. అక్కడి కుండలు చేసి జీవించేవాడు గోరా. వాటిని దగ్గరలోవున్న పండరీపురం పోయి అమ్ముకుంటూ వుండేవాడు.

నడుస్తున్నా పాడుతున్నా భోంచేస్తున్నా మాట్లాడుతున్నా పాండురంగని చింతలోనే గోరా తన కాలం గడిపేవాడు.

ఒక్కొక్కసారి మట్టిత్రొక్కుతూ పాండురంగ స్మరణలో నృత్యం కూడా చేసేవాడు గోరా.

గోరాభార్య గంగూబాయి. వీరికి కలిగిన బాలుని పేరు "విట్టూ". అతనికి ఏడాది నిండేసరికి పుట్టినరోజు జరపాలని గంగూబాయి ఉబలాటపడింది.

తండ్రి భజన సంకీర్తనంలో తన్మయుడై వుండగా తన బిడ్డను విడచి ఇరుగు పొరుగువారిని పుట్టినరోజు పేరంటానికి పిలవడానికి "విట్టూ" తల్లి వెళ్ళింది.

నృత్యంలో పరవశించి పోతున్న గోరా ఏమీ గ్రహించే స్థితిలో లేడు. ఏడాది విట్టూ మట్టి త్రొక్కుతున్న గోరా పాదాల క్రిందపడి మట్టిపాలయినాడు.

ఇంటికి వచ్చి ఆ దృశ్యం చూచిన గంగూబాయి నిర్విణ్ణురాలైంది. భర్తను నానా దుర్భాషలాడింది. తన శరీరం తాకితే మహాపాపం చుట్టుకోగలదని శాపనార్థాలు పెట్టింది.

మహాభక్తుడు గోరా ఆ మాటమీదనే నిలిచాడు. కొన్నాళ్ళకు గోరా గంగూబాయి కోరికపై ఆమె సోదరి తులసిని పెండ్లి చేసుకున్నాడు. ఆమెను అతడు తాకలేదు.

ఒకనాడు అక్కా చెల్లెళ్లు తమ భర్తపై చేతులుంచారు. తన వ్రతం భంగం కాగలదని భయపడిన తన రెండుచేతులనూ గోరా స్వయంగా ఖండించుకొని మ్రోడుగా నిలిచాడు.

నిరంతరం హరినామ స్మరణ చేస్తూ వుండేవాడు గోరా. పాండురంగడే అతనికి పనివాడై కుండలు చేసి పెట్టేవాడు.

నామ్‌దేవ్ పూర్వజన్మలో ఉద్ధవుడు. శ్రీకృష్ణుని మహాభక్తుడు. ప్రతిదినమూ తనకు పనిచేసి పెట్టుతున్నది పాండురంగడేనని నామ్‌దేవ్ గోరాకు తెలుపుతాడు.

గోరా తన భార్యలతో పాండురంగ సన్నిధికి చేరి అఖండనామకీర్తనం చేయసాగాడు.

తతిమ్మావారి మాదిరి వాయిద్యాలు వాయించడానికి తనకు చేతులు లేకపోయినవిగదా అని వాపోయినాడు.

ఇంతలో పాండురంగని విగ్రహం నుండి రెండు పూలు రాలినవి. అప్పుడొక అద్భుతం జరిగింది. గోరాకు రెండు చేతులూ వచ్చాయి.

గోరా కృతజ్ఞతతో స్వామిని కీర్తించాడు.

అమ్మవారు కరుణించి చనిపోయిన విట్టూను తిరిగి ప్రసాదించింది.

గృహస్థాశ్రమ నిర్వహణకూడా తన సేవలో భాగమేనని భార్యలతో, బిడ్డతో సుఖంగా వుండమని గోరాను పాండురంగడు ఆశీర్వదించాడు.

చిరకాలం భగవన్నామ కీర్తనలతో గడపి గోరా పాండురంగ ధామం చేరాడు.



# నామదేవ్ (క్రీ.శ.1270-1350)



ఒక ఊరిలో మిట్ట మధ్యాహ్నం వేళ కుక్క ఒక ఆసామి వంట యింటిలో ప్రవేశించి రొట్టెముక్కల నోట కరచుకొని ఉడాయిస్తున్నది. ఇంతలో ఇంటివారు ఆ కుక్కను చావ మోదారు.

"కుయ్యో" "మొఱ్ఱో" అని అరవసాగింది కుక్క. ఆ ఇంటిలోనే మెత్తని మనసు కలవాడొకడున్నాడు. అతనికి కుక్కని చూచి జాలి కలిగింది. మంచి రుచికరమైన అరిసెను తెచ్చి దాని నోటికి అందించాడు.

ఆనందంతో కుక్కముఖం కళకళలాడింది. భక్తుని ముఖం మరింత వెలిగింది. వెంటనే ఇంటిలోనికి వెళ్ళి నేతి గిన్నెతెచ్చి మరి ఒక అరిసెను దానిలో ముంచి కుక్క నోటికి అందించాడు.

చూసేవారికి అది చోద్యం గానే వుంది. కానీ, భక్తుని దృష్టిలో పరమాత్ముడే కుక్క రూపంలో వచ్చినట్లు అనిపించింది.

ఆ భక్తుడు ఎవరో కాదు! 13వ శతాబ్దంలో పండరిపురాన్ని పావనం చేసిన నామదేవుడు.

మహారాష్ట్ర భక్తులలో నామదేవునకు గల స్థానం విశిష్టమైనది. అతని అరవై అభంగాలు గురునానక్ సంకలనం చేసిన గ్రంథ సాహెబ్‌లో చేర్చబడినాయి. మరి ఏ యితర మహారాష్ట్ర భక్తుని రచనలకు యిలాంటి గౌరవం లభించలేదు.

నామ్‌దేవ్ అభంగాల సంకలనాన్ని 'గాథ' అంటారు. దీనిలో రెండువేలా అయిదు నూర్ల అభంగాలున్నాయి. ఇవి అన్ని ఆయన పేరుతో చలామణి అయినా

వాటిలో నాలుగో వంతు మాత్రమే ఆయన వ్రాసినవి. మిగిలినవి ఆయన పేరుతో ఇతరులు చేర్చినవే!

గోరాకుంభార్, నామ్‌దేవ్‌లు ఒకే కాలంలో జీవించారు. గోరా కుండలు చేసేవాడు కదా! ఒకసారి తన ఇంటికి వచ్చిన భక్తుల తలలపై కట్టెలు తట్టూ వచ్చాడు.

నామ్‌దేవ్ తలపై కూడా ఒకటి అంటించి "ఈ కుండ ఇంకా బాగుగా కాలలేదు' ' అన్నాడు.

నలుగురిలో గోరా ఈ మాదిరి చేయడం అన్యాయం అనుకున్నాడు. నామ్‌దేవ్ పాండు రంగడితో మొర పెట్టుకున్నాడు.

కుమ్మరి చేసిన పనిలో తప్పులేదన్నాడు స్వామి. నామదేవ్‌లో అంత వరకూ వున్న అహంకారం అంతటితో మాయమయింది.

జీవితంలో ఎదుర్కొన్న ఇక్కట్లన్నీ చివరవరకూ నామదేవ్ నెగ్గు కుంటూనే వచ్చాడు.

వినోబాఖేచర్ అనే సాధువు వద్ద నామ్‌దేవ్ దీక్ష పొందారు.

పాండురంగని అనుగ్రహం కోసం నామ్‌దేవ్ తపించి పోయేవాడు. అభంగాలలో అతని పరితాపం కన్పిస్తుంది.

"చిన్నవీ పెద్దవీ అనేక ఘోరాలు చేసిన పాపిన ప్రభూ! విసిగి వేసట చెంది నీ దర్శనం దొరకకపోతే వెళ్ళి పోతానని అనుకోకు. అలా ఎన్నటికీ జరుగదు. నీ పాదాలను కట్టివేసి నా హృదయంలో బంధిస్తాను. నా హృదయం నీకు బందిఖానా అవుతుంది' ' అంటూ భగవంతుణ్ణి అనేక విధాల వేడుకుంటాడు నామదేవ్.

భక్తి వినాముక్తికి మార్గమే లేదని నామదేవ్ విశ్వాసం. మంచి మార్గం చూపగల సజ్జనుల సాంగత్యం అమూల్యమైనదని అతని భావన.

"మంచీ చెడూ ఎంచకుండా కడకు తనపై గొడ్డలి విసిరే వారికి -- అందరికీ మధుర ఫలాలు యిచ్చే వృక్షాలు వంటి వారు సజ్జనులు" అన్నాడు నామదేవ్.

బంగారాన్ని, మట్టినీ ఒకే దృష్టితో చూచేవాడే సాధువని అతని మతము.

తన యందు పూర్తి విశ్వాసం కలిగియున్న నామదేవ్‌ను భగవంతుడు అనేక విధాల కరుణించాడు.

ఒకసారి నామ్‌దేవ్ ఇల్లు తగలబడి పోయింది. పాండురంగడే స్వయంగా

కూలివాడై దానిని మరమ్మత్తు చేసి చక్కదిద్దాడు. ఆ యింటికి వింత అందం వచ్చింది.

ఇరుగు పొరుగు వారికి కన్ను కుట్టింది. "మాకు ఆ మాదిరి ఇల్లు కట్టిపెట్టిన ఎడల రెండు రెట్లు సొమ్ము ఇస్తామన్నారు పొరుగింటివారు.

"నా యిల్లు బాగు చేసినది శ్రీహరి. పూర్ణ భక్తితో ఆయనకు దాసోహం అనండి. మీ ఇల్లు బంగారం అవుతుంది. మీరు ఇవ్వవలసిన కూలి అదే". అని వారికి నామ్‌దేవ్ జవాబు చెప్పాడు.

ఒక అభంగంలో భక్తి ప్రాధాన్యాన్ని నామదేవ్ ఇలా వర్ణించడు. "నామనస్సు దర్జీ వాని కొలతబద్ద. నాలిక అతని కత్తెర. జీవితం అనే వస్త్రాన్ని మనస్సు అనే కొలబద్దతో కొలచి నాలిక అనే కత్తెరతో కత్తిరిస్తారు.

ఈ విధంగా ఎల్లవేళలా శ్రీహరినామాన్ని స్మరించాడు నామదేవ్.

క్రీ.శ. 1270లో పండరీపురంలో జన్మించిన నామదేవ్ ఎనభై సంవత్సరాలు జీవించి 1350లో సమాధి చెందాడు.

సామాన్య ప్రజలను విశేషంగా ఆకర్షిస్తూ నామదేవ్ అభంగాలు మహారాష్ట్ర సాహిత్యంలో చిరస్థాయి అయినాయి.



# ఏకనాధుడు (1533-1598)



సంస్కృతము దేవ భాష కాబట్టి దానిలోనే భగవంతుని కీర్తించాలనే సంప్రదాయాన్ని త్రోసి రాజని జ్ఞానదేవ్ మరాఠీలో భగవద్గీత వ్యాఖ్యానించాడు.

ఏకనాథ్ మరో అడుగు ముందుకువేసి సంస్కృతం భగవంతుని భాష అయితే ఇతర భాషలు దొంగలవా? అని ప్రశ్నించాడు.

జ్ఞానదేవుని "జ్ఞానేశ్వరి" మాదిరి మరాఠీ సాహిత్యాన్ని సంపన్నం చేసిన గ్రంథం ఏకనాథుని "భాగవతం".

భాగవతంలోని ద్వితీయ స్కంధంలో నాలుగు శ్లోకాలలో గొప్ప పరమార్థ మున్నదని ఏకనాధుడు భావించాడు. అందలి అంతరార్థాన్ని 1036 'ఓవీ' అనే దేశీయ వృత్తముల్లో వ్రాశాడు.

ఇతడు వ్రాసిన మరొక ప్రశస్త కావ్యము 'రుక్మిణీ స్వయంవరము' ఇది 1711లో 'ఓవీ'లలో వ్రాయబడినది.

శ్రీకృష్ణునకు రుక్మిణీదేవి వ్రాసిన లేఖ అత్యంత మధురంగా వర్ణితమైనది. ఏకనాథ్ లేఖనిలో బ్రహ్మదేవుడు శ్రీకృష్ణుని వర్ణించిన తీరు మనోహరం.

"చతుర్భుజా ఘనసాఁవళా
మకర కుండలేఁ కౌస్తుభగళా
వైజయంతి వక్షస్థళా
అపాద వన మాలా"

ఏకనాధునికి జ్ఞానదేవునిపట్ల అపార గౌరవము. అతని జ్ఞానేశ్వరిని సంశోధించి అది అమృత భాండమని పేర్కొనినాడు.

పామరులకు సైతం అర్థం కావాలనే తలంపుతో ఏకనాథ్ 'భారుడు' గౌళన. అనే గేయాలు రచించాడు.

ఏకనాధుని మూల పురుషుడు భానుదాసు గొప్ప వేద పండితుడు. సంపన్నులు కూడా. ఏకనాధుని తండ్రి సూర్యనారాయణుడు, తల్లి రుక్మాబాయి.

ఏకనాధుని తల్లి దండ్రులు అతని బాల్యము నందే కాల ధర్మం చెందారు. ఏకనాధునికి ఉపదేశం చేసిన పుణ్యపురుషుడు జనార్దనస్వామి.

జనార్థనస్వామికి తరచూ దత్తాత్రేయ దర్శన మగుచుండేది. ఏకనాధునికి గురువు దయవలన దత్తాత్రేయుని ఆశీస్సులు లభించాయి. యుక్త వయస్సున ఏకనాథ్ గిరిజా బాయి అను గుణవతిని వివాహమాడి మంచి గృహస్థుగా ప్రసిద్ధుడయినాడు.

ఈ దంపతులకు కాలక్రమమున గోదుబాయ్, గంగాబాయ్ అతని ఇద్దరు కుమార్తెలు. హరిపండితుడను కుమారుడు కలిగారు.

ఏకనాథ్ దంపతులకు 'శ్రీఖండావ్' యను బ్రాహ్మణ బాలకుడు ఎక్కడి నుండియో వచ్చి కుటుంబంలో అన్ని పనులు చక్కదిద్దుతూ సేవకుడై వుండెను.

ద్వారకా వాసియగు శ్రీకృష్ణుడే తమ ఇంట నున్న సేవకుడని ఆ దంపతులు చాలాకాలమునకు గుర్తించారు.

తన జననీ జనకుల శ్రాద్ధము దినమున ఏకనాథ్ తన తోటలో పనిచేయు అస్పృశ్యుల కెల్లరకు విందుభోజనం ఏర్పాటు చేశాడు. సనాతన బ్రాహ్మణులు ఆగ్రహించి అతనిని వెలివేశారు.

ఏకనాథ్ శ్రద్ధగా ధ్యానించి ఆహ్వానించగా పితృదేవతలే భువి నుండి దిగి వచ్చి శ్రాద్ధ పదార్థములు స్వీకరించారు.

దీనితో బ్రాహ్మణులు కనువిప్పు కలిగి ఏకనాథ్ మహిమను గ్రహించారు.

మరాఠీలో రచించిన ఏకనాధుని భాగవతాన్ని కాశీలో మఠాధిపతులు తప్పుబట్టి దండించాలని నిశ్చయించారు.

వందలాది తన శిష్యుల సమక్షములో ఏకనాధుని ముఖము సైతము చూడరాదను మిషతో తెర కట్టించుకొని మాట్లాడసాగినారు.

సభా మండపంలో గల అందరి శిష్యులకు ఏకనాథ్ సాక్షాత్తు శ్రీకృష్ణునిగా గోచర మవుతుండేవారు.

మఠాధిపతి ఏకనాథ్ భాగవత రచన గంగా నదిలో విసరి వేయమని అజ్ఞ ఇచ్చాడు. శిష్యులు ఆ పనికి పూనగా గంగాదేవి స్త్రీ రూపము ధరించి తన

స్వహస్తములతో ఆ గ్రంధాన్ని తన శిరస్సున మోసుకు రావడం చూసి శిష్యులు నివ్వెరపోయారు.

మఠాధిపతికీ వార్త అందిన వెంటనే తెర తొలగించి ఏకనాథుని చూడగా అతడు శ్రీకృష్ణునివలె కన్పించాడు.

జ్ఞానదేవ్ స్వప్నంలో ఏకనాథునికి కన్పించి తన సమాధిని పునర్నిర్మించమని కోరుతాడు.

ఏకనాథ్ శిష్యులను వెంటబెట్టుకొని కొన్ని దినాలు అక్కడ ఆ కార్యక్రమంలో నిమగ్నుడవుతాడు.

ఒక చిల్లర వర్తకుడు ఒక దుకాణము తెరచి కూలి వాండ్లకు వలసిన వస్తువులు అందజేస్తూ వుంటాడు. సమాధి పని పూర్తి అయిన పిమ్మట తనకు సొమ్ము చెల్లించే ఏర్పాటు చేసికుంటాడు.

కానీ, సమాధి పునర్నిర్మాణం జరిగేసరికి అక్కడ దుకాణం కానీ చిల్లర వర్తకుడు గానీ కన్పించలేదు. పాండురంగడే చిల్లర వర్తకుని రూపంతో ఏకనాథ్‌కు తోడ్పడినట్లు శిష్యులు గ్రహించారు.

తన చరమదశను ఏకనాథ్ గుర్తెరిగి పట్టణ ప్రజలకు తన మరణ వార్తను తెలిపి ఒకనాటి ఆదివారం మధ్యాహ్నం గోదావరిలో జలసమాధి అయినారు.

పైఠాన్‌లో నెలకొనబడిన ఏకనాథ్ బృందావనమున ప్రతి సంవత్సరము బహుళ షష్టినాడు ఆయన ఆరాధన నేటికిని నిర్వహింపబడుచున్నది.

ఏకనాధుని సహచరులుగా వుండిన విఠరేణుకా, జనీ జనర్ధన్ జాను జనార్దన్, దాసోపంత్‌లు కూడా భక్తిగీతాలు రచయితలుగా ఖ్యాతి వడిసినారు.

వీరందరూ నాథ పంచకముగా ప్రసిద్ధులు.



# సమర్థ రామదాసు (1608-1680)



వేద పండితుల వంశానికి చెందిన 'నారాయణ' అనే బాలునికి తల్లి దండ్రులు వివాహం జరపటానికి అంతా సిద్ధమయింది. పెండ్లి పీటలపై కూర్చొని పురోహితులు చదివిన వేదమంత్రంలో అర్థాన్ని గ్రహించాడు. జీవితాంతం భార్య తనకు బంధ కారణంగా భావించాడు.

తక్షణం పెళ్ళి పీటల నుండి లేచి తపస్సుకు వెళ్ళిపోయాడు. ఆ యువకుడే తరువాతి కాలంలో మహాభక్తుడై సమర్థ రామదాసుగా విఖ్యాతుడైనాడు. మహారాష్ట్ర భక్తులనేకులు పండరి విఠలుని భక్తులుకాగా, రామాదాసు శ్రీరామచంద్రుని పరమ భక్తుడు.

ఇతని జననం కూడా శ్రీరామనవమినాడే జరగటం విశేషం!

'జాంబా' గోదావరీ నదీ తీరంలోని ఒక గ్రామం. సూర్యాజీ పంతు, రాహుబాయి సమర్థ ఆ ఊరిలోని సదాచారంకల ఆదర్శ దంపతులు.

వారి మూడవ సంతానంగా 'నారాయణ' జన్మించాడు. రామ భక్తి నారాయణకు పుట్టుకతోనే అలవడింది.

ఎనిమిదవ ఏట ఉపనయనం అయిన 'నారాయణ' గాయత్రీ మంత్రంతో పాటు రామనామాన్ని తదేక దీక్షతో జపించాడు.

కల్యాణ వేదిక నుండి కనుమరుగైన 'నారాయణ' అరణ్యాలలో ఏకాంతం వాసం చేశాడు. పన్నెండు ఏండ్లకఠోర తపస్సు పిమ్మట రామచంద్రుని దర్శనమయింది. నాట నుండి ఆయన "రామదాసు"గా ప్రశస్తుడైనాడు. ముందు ఆంజనేయుడతనిని పరీక్షిస్తాడు. తరువాత అనుగ్రహిస్తాడు.

పండరి నాథుడైన విఠలుడు స్వామికి శ్రీరామచంద్రుని రూపంలో ప్రత్యక్షమౌతాడు.

శ్రీరామ, శ్రీకృష్ణ అవతారముల యందు అభేదాన్ని పాటించిన మహనీయుడు సమర్థ రామదాసు.

మహారాష్ట్ర పాలకుడైన శివాజీ స్వామీజీని తన గురువుగా భావిస్తాడు. సజ్జనగడకోట సమీపాన రామదాస స్వామికి వసతి నేర్పరచి ప్రతి గురువారం ఆయన దర్శనం చేసికొనేవాడు.

శివాజీ మహారాజుల గద్దె కెక్కినది 1674వ సంవత్సరం. ఆ సందర్భంగా స్వామి అతని కోటలో 45 దినములు మకాం వేశాడు.

రామదాసు కౌపీనం ధరించి జోలె చేతపట్టి భిక్షాటన చేసి జీవించేవాడు. శివాజీ భక్తిని పరీక్షించవలెనన్న తలంపుతో స్వామి ఒక మారు ఛత్రపతి నిండు సభలో నుండగా ప్రవేశిస్తాడు.

స్వామి కనిపించినంతటనే ఎదురేగి గద్దెదిగి శివాజీ సాష్టాంగ పడినాడు.

స్వామి భిక్ష నర్థించగా తనయావత్తు రాజ్యమునూ స్వామి కర్పిస్తూ దానపత్రము వ్రాసి రాజముద్రికతో సహా జోలెలో ఆ పత్రము వుంచాడు.

స్వామిజీ తన శిష్యుని గురుభక్తికి మెచ్చి "నాకు మారుగా ఈ రాజ్యమును నీవేపాలింపుము. నీబావుటాకు భగావాన్ ధ్వజము (కాషాయరంగు) ప్రవేశ పెట్టుమని ఆదేశించాడు.

నాటినుండి శివాజీ కాషాయధ్వజమును తన పతాకగా ప్రకటించుకొని రాజ్యపాలన ధర్మబద్ధంగా సాగించాడు.

1661లో "తులజా భవానీ" దివ్య సుందర విగ్రహాన్ని శివాజీ ప్రార్థనపై ప్రతాపగడ కోటలో స్వామీజీ ప్రతిష్ఠించాడు.

వస్త్రాలం, ఆభరణాలతో గాక వెంలకువ, ప్రజ్ఞలతో శరీరాన్ని అలంకరించుకొమ్మని స్వామి శివాజీకి హితబోధ చేశాడు.

రామదాసు విరచిత 'దాసబోధ' అతని గ్రంథములలో కెల్లా తలమానికమైనది. ఆధ్యాత్మికత చింతనలో అత్యున్నత దశనందుకున్న మనిషి యొక్క అనుభవసారమే ఈ గ్రంథమని 'రానడే' అను ఆచార్యుడు దీనిని శ్లాంఘించాడు.

మనస్సును సంబోధించి వ్రాసిన శ్లోక సంపుటి 'మానసబోధ' కరుణాష్టకం - వీరి రచనలలో బహుళ ప్రచారం నందుకున్నవి.

కపట గోషాయిలను నిరసిస్తూ వీరు 'జనస్వభావగోసాయి' గ్రంథాన్ని రచించారు.

ఇతర మహారాష్ట్ర భక్తుల మాదిరిగానే స్వామి నామ మహాత్మ్యాన్ని నొక్కిచెప్పారు.

**"భగవన్నామ స్మరణలో కులభేదంలేదు**

**అల్పులూ అధికులూ**

**మంద మతులూ మేధావులనే తేడా**

**లేకుండా నామోచ్ఛారణ సర్వులను కడతేరుస్తుందని"** స్వామి చెప్పారు.

స్వామిజీ ఇంకా ఇలా చెప్పారు. ఆదర్శ పురుషుడెవరంటే ఆచరణలో పెట్టేవాడేనని స్వామి శెలవిచ్చారు. సాధువులు ఒక క్షణం వృథా చేయరాదు. మానవులు - అతనికి ఏమైనా కోరికలున్నవాయని - పరీక్షిస్తుంటారు.

సుగుణాలన్ని అతడు ముందు అలవరచుకొని పిమ్మట ప్రజలకు బోధగావిస్తూ వుంటాడు. "హృదయ పూర్వకంగా తమ విధులను చేసేవారిని మనము తప్పక విశ్వసించాలి. గొప్ప వ్యక్తి మరి కొందరు గొప్పవాళ్ళను సృష్టించగలిగి వుండాలి."

మహోన్నత జ్ఞానము, నిరుపమాన దేశభక్తి, నిశ్చల సంఘోద్ధరణాసక్తి, సమర్థ రామదాసులో నిండి నిబిడీ కృతమయిన వనటంలో సందేహం లేదు.





జననం 12.10.1936

పలువురి జీవిత చరిత్రలు రచించారు.

భగవాన్ 'రమణ' కావ్యకంఠ'నాయన'భక్తులు

రావినూతల శ్రీరాములు

---

## ఈ గ్రంథంపై పెద్దల, పత్రికల అభిప్రాయాలు

☆ ప్రాంతీయ భేదాలు త్రోసి రాజని ప్రముఖ భక్త కవులను గురించి వ్రాసిన వ్యాసాలు బాగున్నాయి. ముఖ్యంగా నమ్మాళ్వార్ బోధనలను సులభ సుందరమైన భాషలో వివరించారు.

— *ఆచార్య చల్లారాధాకృష్ణశర్మ*

☆ భాష సరళం రచన సహజంగా వున్నవి.

— *డా॥ ఇలపావులూరి పాండురంగారావు*

☆ ఆపాత మధుర రచన — *శ్రీహరి ఆదిశేషువు*

☆ నిసర్గ సుందర రచన— *శ్రీ జి. వెన్నయ్య*

☆ సులభ సుందర శైలిలో సాగి బాలురకు సుబోధకంగా వున్నది.

— *శ్రీ గొల్లపూడి ప్రకాశరావు*

☆ వాసుదాసుగారి ఆర్య కథానిధిని తలపునకు తెచ్చుచున్నది.

— *శ్రీ కలచవీడు శ్రీనివాసాచార్యులు*

☆ చదువవలసే రచన. "భారతి" ఏప్రిల్ 84 (సమీక్షకులు శ్రీ యామిజాల)

☆ సాహిత్య అధ్యయనం చేసేవారికి మతం పట్లమమకారం పెంచుకున్నవారికి ఈ చిన్న పుస్తకం కరదీపికలాంటిది. (1985 జూన్ సప్తగిరిలో డా॥ సర్వోత్తమన్ సమీక్ష)

☆ ఈ సంపుటి అమూల్యమైనది. — *డి.రామలింగం*